శ్రీ గణేశాయ నమః

# మహానంది
## (స్థల పురాణము)

( శివ, స్కాంద, లింగాది మహా పురాణములను బట్టి శిలాదమహర్షి తపఃఫలముగ పరమేశ్వరుడే మహానందిగా ఆవిర్భవించి హరి, బ్రహ్మేంద్రాదులచే సర్వభూతాధిపతి, సర్వగణాధిపతీ సర్వ లోకాధిపతిగ పట్టాభిషిక్తుడై, గంగాది సర్వపుణ్యతీర్థములు తనను సేవించుటచే సర్వ పాపహరమై, మోక్షప్రధమగు మహా క్షేత్ర రాజముగా వెలయుచుండెను. )


సంకలనము ;

**వాజపేయం సుబ్రహ్మణ్యశాస్త్రి**

*Director : Oriental Research Centre*

**Seetampet, RAJAHMUNDRY**





ప్రకాశకులు

**జి. ఓబులరెడ్డి,**

కార్యనిర్వహణాధికారి మరియు సహాయ కమీషనరు

**శ్రీ మహానందీశ్వరస్వామి దేవస్థానము**

**మహానంది**

నంద్యాల తాలూకా - కర్నూలు జిల్లా (ఆంధ్రప్రదేశ్)

ప్రతులు : 1000
ప్రభవ, మాఘమాసం
1988, ఫిబ్రవరి

ప్రతులు : 5,000
1991 ఆగష్టు

ప్రతులు : 10,000
1992, డిసెంబరు.

వెల :
6-50

ముద్రణ :
శ్రీ శివసాయి ప్రింటర్స్,
నంద్యాల — 518 501.
(కర్నూలు జిల్లా)

# విషయ సూచిక



శ్రీః

శ్రీ గణేశాయ నమః

శివాయ గురవే నమః

# మహానంది

## స్థలపురాణము

—o-

## పరిచయము

మహానంది స్థల మహాత్మ్యము అత్యద్భుతము. లోకములో పుణ్య జలాశయములకు తీర్థములనియు, దివ్య దేవతా నిలయము లకు క్షేత్రములనియు పురాణ ప్రసిద్ధమైన వ్యవహారము కలదు. అట్టి తీర్థములలో గంగా, యమునా, సరస్వతీ నదుల కూడలి యగుటచే త్రివేణిసంగమ మనబడు ప్రయాగకు తీర్థరాజమనియు, సర్వ దేవతా సాన్నిధ్యముచే కాశీపట్టణమునకు క్షేత్రరాజమనియు కీర్తి ప్రతిష్ఠలు కలిగినవి. కాని మన మహానందికి తీర్థక్షేత్రముల కలయికలలో నగ్రగణ్యమగుటయేగాక స్నానదర్శనాది సేవలచే నిత్య నిరతిశయ పరమానంద కంద సుఖ స్వరూపమగు మోక్ష మహానంద సంధాయకమగుటచే "మహానంది" యను సార్థకనామము గల్గికది.

"మహానంది" క్షేత్ర మహాత్మ్యము లింగపురాణము, శివ పురాణము, స్కాందపురాణములోని శ్రీశైలఖండము, రేవాఖండము శివమహాత్మ్యఖండము, హేమకూటఖండము మున్నగు అనేక పౌరాణిక విశేషములతోను, ఐతిహాసిక, చారిత్రక విశేషములతోను భక్తుల చరిత్రలతోను విరాజిల్లు చున్నది.

ఈశ్వరుని వాహనమగు నందీశ్వరునకే నంది, మహానంది. నందికేశ్వరుడు, నందీశ్వరుడు మున్నగు నామములెన్నియో గలవు. నంది ఆలయము లేక నంద్యాల అను పట్టణము కేంద్రముగా గల్గి దాని చుట్టుపట్ల (1) ప్రథమనంది, (2) నాగనంది, (3) వినాయక నంది, (4) గరుడనంది, (5) శివనంది, (6) విష్ణునంది. (కృష్ణ నంది, (7) మహానంది, (8) సూర్యనంది, (9) సోమనంది అను వివిధ నామములతో ఏబదిమైళ్ళ ప్రదేశములలో నందిమండల మును ప్రసిద్ధ నామముగల మహాక్షేత్రములో విరాజిల్లుచున్న మూర్తులన్నియు నందీశ్వరుని అంశలే.

కాని చరిత్రలోని నందవంశపు రాజులగు నవనందులకును మన నందిమండలములోని నవనంది దేవతామూర్తులకును ఎట్టి సంబంధము లేదు. నందవంశపు రాజులు శిశునాగవంశపు కడపటి రాజగు మహానంది అను మగధ (Bihar) దేశపు పాలకుని దాసీ పుత్రులు. నవనందులలో ప్రథముడు మహాపద్మనందుడు లేక యోగనందుడు అను పేరుగలవాడు, ఇతడు తన తండ్రియగు

మహానంది అనంతరము అనగా క్రీ॥పూ॥ 1634 (B.C.) సంవత్స రములో మగధదేశమునకు రాజయ్యెను. ఈ మహాపద్మనందునకు ఎనమండుగురు (8) కుమారులు గలరు. వీరందరికీ నవనందులని పేరు. ఈ మహానందుడు బహుపరాక్రమవంతుడు. ఇతడు మగధ దేశమందలి పాటలీపుత్రమును (Patna) రాజధానిగ చేసి ఉత్తర భారతదేశమునంతను ఎనుబదిఎనిమిది (88) సంవత్సరములు ఏక ఛత్రాధిపత్యముగ పాలించెను. ఇతని జ్యేష్ఠపుత్రుడు సుమాలు పన్నెండు (12) సంవత్సరములు రాజ్యమేలెను మహాపండితుడగు వరరుచి, పాణిని, చాణక్యుడు అనువారు ఈ సుమాలికాలమువారు చాణక్యునకు కౌటిల్యుడు, విష్ణుగుప్తుడు, శకటాయనుడు అను నామాంతరములు గలవు. పైన చెప్పిన మహాపద్మనందుడు క్షత్రియ వంశములను నాశనము చేయగా చాణక్యుడు మంత్ర బలముచే యీ నవనందులను నాశనముచేసి తాను పదియారు (16) సంవత్సరములు రాజ్యమేలి క్షత్రియరాజగు మౌర్య వంశజునకు క్రీ॥ పూ॥ 1516 (BC) సం॥లో పట్టాభిషేకము చేసి రాజ్య భారమప్పగించెను. వీరు నందవంశ రాజులుగాని నందిక్షేత్ర పాలుకులుగారు.

# మహానంది ప్రాదుర్భావము

మహానంది క్షేత్ర ప్రాదుర్భావమునుగూర్చి లింగపురాణము, శివమహాపురాణము అను ప్రమాణ గ్రంథములలో స్వల్పభేధములతో పురాణగాథలు కలవు. ఈ భేధములు కల్పభేదమును బట్టి వచ్చినవని నమ్మినచో ఈ క్షేత్రము కల్పాంతరములలోగూడ ప్రసిద్ధికెక్కినదని విశ్వసింపవలసి యుండును. మహానంది అవతార మహిమ, క్షేత్రమహిమ, తీర్థమహిమ మున్నగునవి స్కాంద పురాణములోని శ్రీశైలఖండము, రేవాఖండము శివ మహాత్మ్య ఖండము, హేమకూటఖండము, సూతసంహిత మున్నగు పౌరాణిక విశేషముల వలనను, నందనరాజు చరితమను ఇతిహసముల వలనను, రససిద్ధుడు మున్నగు భక్తుల చరిత్రల వలనను విశదము కాగలవు.

ఇతర వివరములనేకములు (1) Manual of Kurnool District, (2) District Gazetteer of Kurnool District (Revised addition) (3) Topographical list of Inscriptions of Madras Presidency by V. Rangachary, MALT, Vol II, [4] Madras Journal Vol. XXIII [ii] 74, [5] South Indian Inscriptions, [6] ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము[7] Fairs and festivals మున్నగు అనేక చారిత్రక గ్రంథములలోను విశేషముగ కలవు.

పై వివరములన్నియు గ్రంథాధారములతో క్రమముగా పరిశీలించినచో ఈ మహానంది క్షేత్రమునకు సాటిరాగాల పుణ్య స్థలము వేరొకటి భూమండలమున లేదని తెలియగలదు.

ఇట్టి మహా పవిత్రస్థలము మరుగుపడి, శ్రీశైలక్షేత్రము నకు అంగముగను, శ్రీశైలయాత్రలో మార్గమధ్యమున సేవింప దగు పుణ్యస్థలముగను మాత్రమే యుండుటకు కారణము ఈ స్థల పురాణము సంపూర్ణ వివరములతో ప్రచురింపబడక పోవుటయే యగును. ఆ లోపమును తీర్చి ఈ స్థల పురాణమును సర్వాంగ సుందరముగ ప్రకటించుటకు దేవస్థానము అధికారులు ఇప్పటి కైనను పూనుకొనుట హర్షింపదగిన విషయము.

## సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశము

(పేజి 181 - మహానంది)

దక్షిణాపథములో తూర్పుభాగమున వ్యాపించిన ఉదయాద్రి పర్వతపంక్తి సాంద్రారణ్యములతో కూడుకొని యున్నది. ఈ గుట్టల వరుసలో నల్లమలై గుట్టలవరుస కర్నూలుజిల్లా ప్రాంత ముపై వ్యాపించియున్నది. ఈ కొండలలో "మహానంది" క్షేత్ర మున్నది.

ప్రకృతి సౌందర్యముతో ప్రకాశమానముగా నున్న పర్వత సానువులు, పచ్చటి వృక్ష జాలములతోను, పూపొదరింఢ్లతోను, దట్టమైన అడవులతోను మనోహరముగా నుండును. మహానంది దేవాలయము నంద్యాలకు తూర్పుదిశన పదిమైళ్ళదూరమునపర్వత పాదమువద్ద నున్నది. ఈ కొండల గర్భమునుండి నిరంతరము జల ధారలు ప్రవహించు చుండును. వీటిలో ఐదుజలధారలు ముఖ్యం గా పేర్కొనదగినవి. ఇవి దేవాలయములోని లింగమూర్తి క్రింద నుండి గుడి ముందరనున్న సరస్సులో పడును.

ఈ దేవాలయ నిర్మాణ మొక అద్భుత విధానము. గర్భగుడి మీద విమానము శిల్పవైచిత్రితో కూడినట్టిది. ఈ శైలీవిధానము ఉత్తర హిందూస్థాన విధానమును పోలియున్నది. ఆకాశము నంటుచున్నదేమో అన్నట్లుగా దేవాలయ శిఖరాగ్రముండును. ఉత్తర హిందూస్థానమునుంచి వచ్చిన ఒక "రససిద్ధుడు" ఈ విమానమును నిర్మించెనందురు.

ఈ పుణ్యస్థలము అత్యంత ప్రాచీనకాలమునుండి ప్రసిద్ధి కెక్కినది. విజయనగరసామ్రాట్టులు పోషించిన ధార్మిక సంస్థలలో మహానంది తీర్థమొకటి.

శిల్ప శోభితమైన దివ్యమందిరము, అత్యంత అద్భుత నిర్మాణమైన గుడిముందరి సరోవరము, అతిప్రాచీనకాలము నుండి యాత్రికులను ఆకర్షించుచున్నవి. ఇచ్చటి పుష్కరిణి యందలి

నీరు నునువెచ్చగా నుండి సంవత్సము పొడుగునను ప్రవహించు చుండును, ఈ నీటిలో రోగ నివారకములగు లోహక ద్రవ్యము లున్నట్లు గూడ తెలియుచున్నది. ఈ కొలనులోని నీరు ఎల్లప్పుడు 5 అడుగుల లోతుగల్గి హెచ్చుతగ్గులు లేక సమస్థాయిలో నుండు నట్లు కొలనులో పడు నీటి మార్గము, కొలనునుండి వెడలిపోవు నీటి మార్గము ఒకే విధముగ కల్పించబడినవి. ఈ కొలనులోనికి జలము ఎచ్చటినుండి వచ్చుచున్నదో ఇంతవరకు ఎవరును కనుకొనలేదు పరంపరగా చెప్పుకొను గాథలనుబట్టి అయిదు జలధారలు భూగర్భ ములో లింగముక్రిందగా ప్రవహించి ఈ కొలనులో పడుచుండునని తెలియుచున్నది. ఆ అయిదు ధారలకు శ్రీశైలధార, నరసింహధార దివోధునిధార, నందితీర్థము, కైలాసతీర్థము అని పేర్లుగలవు.

లింగకారములో నున్న పరమేశ్వరుని మూలవిగ్రహము విశిష్టమైనది. ఇది సాలగ్రామ సంయుతమై, అధ్యాత్మికశక్తి సంపన్నమైయున్నది. పూజారితో అవసరము లేకుండ కాశీలో వలెనే ఇచ్చటను లింగమూర్తిని భక్తులు అర్చించవచ్చును. దక్షిణ హిందూస్థానములో మరెచ్చటను ఇట్టి యాచారము కనబడదు. ప్రధాన దేవమందిరమునకు ప్రక్కన అమ్మవారి గుడికలదు. ఈ దేవి విగ్రహమునందు శ్రీ ఆదిశంకరులు "శ్రీచక్రమును"ను నెలకొల్పినట్లు తెలియుచున్నది.

ఈ ప్రదేశమునకు "నవనంది" అనియు పేరుగలదు. ఇచ్చట నంది దేవతావిగ్రహములు తొమ్మిది దేవాలయములు ( పద్మనంది

నాగనంది, వినాయకనంది, గరుడనంది, బ్రహ్మనంది, సూర్యనంది విష్ణునంది, సోమనంది, శివనంది) చుట్టుకొని యున్నవి. "నంది ఆలయము" అను పదమే భ్రష్టతనొంది "నంద్యాల" గా మారినది ఈ క్షేత్రమునకు నంద్యాల పురము పశ్చిమదిశన పది మైళ్ళ దూరములో నున్నది.

ఈ దేవాలయమునకు సంబంధించిన పురాణగాథలును గలవు. పర్వతరాజ కుమారులైన "శిలాదుడు" "నంది" అను భక్తులిద్దరు పరమేశ్వరుని గూర్చి తపస్సు చేసినారట. పరమేశ్వరుడు వారి తపస్సునకు మెచ్చి "శిలాదు" ని పవిత్ర పర్వత రాజముచేసి తానందు నివసించసాగినాడట. ఇక రెండవ కుమారుడైన "నంది" ని తన వాహనముగ మార్చుకొన్నాడట.

రాజకుమారుడైన "నంది" తపస్సు చేసిన స్థలమే "మహానంది" యని తెలియుచున్నది.

మరియొక కథనము ప్రకారము నందులను రాజులు (11) పదునొకండవ శతాబ్దములో ఈ ప్రాంతములోనే యుండిననియు, వారు ఎన్నో గుళ్ళు గోపురములు కట్టించిరనియు, తమ కులదైవతమగు "నందిని" పూజించుచుండిరనియు చెప్పబడుచున్నది. ఈ దేవాలయము విజయనగర చక్రవర్తులాదిగా గల పెక్కు రాజ వంశీయుల అభిమానమునకు, భక్తి ప్రపత్తులకు పాత్రమైనది. ఈ దేవాలయమునకు వారు విరివిగా దానధర్మములు చేసి యున్నారు.

"మహానంది"లో జరుగు శివరాత్రి మహోత్సవమునకు వ్యయ భారమంతయు తమ స్వంత ధనమునుండి భరించుచుండిరనుటకు లిఖిత దృష్టాంతములు గలవు.

"మహానంది" కేవలము పుణ్యతీర్థమే గాక ప్రకృతిశోభను విలోకించఁగోరువారి వినోద విజ్ఞాన యాత్రలకు ఆహ్లాదకరముగా నుండు ఘనమైన క్షేత్రము.

)...(

# మహానంది - ఉద్భవము

(లింగ పురాణము)

## మహానందీశ్వర ధ్యానార్చన విధానము

లింగపురాణం - 27 అధ్యాయము - శ్లో॥ 19

శ్లో॥ పార్శ్వతో దేవదేవస్య నందినం మాం సమర్చయేత్;
దీప్తానలాయుత ప్రఖ్యం త్రినేత్రం త్రిదశేశ్వరమ్ ః
బాలేందుముకుటంచైవ హరివక్త్రం చతుర్భుజమ్ ః
పుష్ప మాలాధరం సౌమ్యం సర్వాభరణ భూషితమ్ ॥

తాత్పర్యము : నంది పరమేశ్వరుని అవతారము గనుక నందీశ్వరుడు పదివేల అగ్నిహోత్రుల కాంతితో త్రినేత్రుడుగను,

దేవతలకు ప్రభువుగను, బాలచంద్రుడు కిరీటము నలంకరించగా వానరముఖము గలిగి చతుర్భుజములతో నున్నట్లును. పుష్ప మాలాలంకృతుడై సర్వాభరణ భూషితుడై సౌమ్యమూర్తి గలిగి శంకరుని పార్శ్వగతుడైనట్లు ధ్యానించి పూజింపవలెను.

## లింగపురాణము 37 అధ్యాయము

మహానందీశ్వరుడు సనత్కుమారునకు తన ఉద్భవమును గూర్చి చెప్పు సందర్భమున స్వోత్కర్ష విషయములో కలహించు చున్న బ్రహ్మ విష్ణువులకు శివుడు వరమొసంగుట.

సనత్కుమార ఉవాచ :

శ్లో॥ భవాన్ కథమనుప్రాప్తో మహాదేవ ముమాపతిమ్ ।
శ్రోతు మిచ్ఛామి తత్సర్వం వక్తు మర్హసిమే ప్రభో॥ 1

తా : నందీశ్వరా! తమరు మహాదేవుడగు ఉమాపతిని ఎట్లు పొందగలిగితిరో ఆ విషయమంతయు నాకు సవిస్తరముగ చెప్ప వలసినది అని సనత్కుమారు డడిగెను.

శైలాదీరువాచ :

ప్రజాకామః శిలాదో భూత్పితా మమ మహామునే ।
సోప్యంధః సుచిరంకాలం తపస్తేపేసుదుశ్చరం ॥ 2

తపతస్తస్య తపసా సంతుష్టో వజ్రధృక్ ప్రభుః ।
శిలాద మహతుష్టోస్మి వరయ స్త్వవదానితి ॥ 3

తతః ప్రణమ్య దేవేశం సహస్రాక్షం సహామరైః
ప్రోవాచ ముని శార్దూల కృతాంజలి పుటో హరిం(శక్రం) 4

తా : నా తండ్రియగు శిలాదమహర్షి సంతానము కొరకు చిరకాలము ఘోర తపమాచరింపగా నతని తపమునకు సంతుష్టుడైన దేవేంద్రుడు "నీ తపమునకు సంతసించితిని, వరమును కోరుకొను"మనెను. అంతట శిలాదుడు దేవ బృందముతో గూడిన దేవేంద్రునికి నమస్కరించి ఇట్లడిగెను.

శిలాద ఉవాచ :

భగవన్దేవతారిఘ్న సహస్రాక్ష వరప్రద
అయోనిజం మృత్యుహీనం పుత్రమిచ్ఛామి సువ్రత. 5

తా : దేవకంటకులగు రాక్షసులను సంహరించి భక్తులకు వరములొసగు దేవేంద్రా "అయోనిసంభవుడు" మృత్యురహితుడు నగు పుత్రుని ప్రసాదింపుమని వరమడిగెను.

శక్ర ఉవాచ :

పుత్రం దాస్యామి విప్రర్షే యోనిజం మృత్యుసంయుతమ్
అన్యథా తేన దాస్యామి మృత్యుహీనాన సంతివై 6

న దాస్యతి సుతంతేత్ర మృత్యు హీనమయోనిజమ్
పితామహూపి భగవాన్కిము తాన్యే మహామనే 7

సోపిదేవః స్వయంబ్రహ్మ మృత్యుహీనోనచేశ్వరః
యోనిజశ్చ మహాతేజా హ్యాండజః పద్మసంభవః 8

మహేశ్వరాంగజశ్చైవ భవాన్యాః తనయః ప్రభుః
తస్యాప్యాయుః సమాఖ్యాతం పరార్ధద్వయ సంమితం 9

కోటికోటి సహస్రాణి అహర్భూతాని యానివై
సమతీతాని కల్పానాం తావచ్ఛేషా పరత్రమె 10

తస్మాదయోనిజే పుత్రె మృత్యుహీనే ప్రయత్నతః
పరిత్యజ్యాశాం విప్రేంద్ర గృహాణాత్మ సమం సుతం 11

తా : అంత ఇంద్రుడు శిలాదునితో మృత్యుహీను లుండరు గాన ఓ విప్రర్షీ ! యోనిసంభవుడు, మృత్యుసహితుడు నగు పుత్రునే ప్రసాదించెను. మృత్యుహీనుడై అయోనిజుడగు పుత్రుని బ్రహ్మదేవుడు కూడ ప్రసాదింప జాలడనగా ఇతరుల మాట చెప్ప నేల ? ఆ బ్రహ్మకూడ యోనిసంభవుడు మృత్యుసహితుడు గదా అతడు అండజుడు, పద్మసంభవుడు, మహేశ్వరాంగజుడు, భవాని తనయుడు, అతనికి ఆయుఃకాలము పరార్థద్వయముగా పరిమితమై యున్నది. కోట్లాది సంవత్సరములుపగలుగాగల్గిన కల్పములు గడచి నన్ని కల్పములు అవశిష్టముగా గలవాడు. కావున ఓ బ్రాహ్మ ణేంద్రా! అయోనిజుడై మృత్యుహీనుడగు కుమారునియందు ఆశను విడచి నీతో సమానుడగు పుత్రుని గ్రహింపుము.

శైలాదిరువాచ :

అంత సనత్కుమారునితో నందికేశ్వరు డిట్లనెను. ఇంద్రుని మాటవినిన పుణ్యాత్ముడగు నా తండ్రి శిలాదమహర్షి దేవేంద్రునితో నిట్లనెను.

శిలాద ఉవాచ :

> భగవన్నండయోనిత్వం పద్మయోనిత్వ మేవచ ।
> మహేశ్వరాంగయోనిత్వం శ్రుతంవై బ్రహ్మణో మయా 13
>
> పురామహేంద్ర ! దాయాదాద్వదత స్తస్య పూర్వజాత్
> నారదాద్వై మహాబాహో కథమత్రాసు నోవద 14
>
> దాక్షాయణీ సావకోపి దేవః పద్మోద్భవాత్మజః
> పౌత్రీ కనకగర్భస్య కథంతస్యాః సుతో విభుః 15

తా : దేవేంద్రా ! బ్రహ్మకు అండజుడని, పద్మజుడని, మహేశ్వరాంగజుడని, మున్నగు వ్యుత్పత్తులు బ్రహ్మకంటె జ్యేష్ఠుడగు నారదుడు చెప్పగానె వింటిని.

ఇచ్చట పద్మసంభవుడగు బ్రహ్మకు దక్ష ప్రజాపతి కుమారుడు గదా. దక్ష ప్రజాపతి కుమార్తె దాక్షాయణి కదా. అట్టి బ్రహ్మకు పౌత్రి అయిన దాక్షాయణికి బ్రహ్మ పుత్రుడెట్లాయెనో తెలియజేయుము.

శక్ర ఉవాచ ;

> స్థానే సంశయితుం విప్ర తన వక్ష్యామి కారణమ్
> కల్పేతత్పురుషే వృత్తం బ్రహ్మణః పరమేష్ఠినః 16
>
> స సర్జ సకాలం ధ్యాత్వా బ్రహ్మాణం పరమేశ్వరః
> జనార్దనో జగన్నాథః కల్పేవై మేఘవాహనే 17

దివ్యం వర్ష సహస్రంతు మేఘోభూత్వావహద్ధరమ్
నారాయణో మహాదేవం బహుమానేన సాదరం 18

తా ; శిలాద! నీ సంశయము సరియైనదే. దీనికి కారణము పరమేశ్వరునియొక్క వృత్తాంతము తత్పురుష కల్పమునగు సంబంధించినది చెప్పెదను వినుము. పూర్వము మేఘవాహన కల్పము నందు పరమేశ్వరుడు సర్వమును సృష్టించి ధ్యానముచేత బ్రహ్మను గూడ సృష్టించెను. అప్పుడు జగన్నాథుడగు జనార్దనుడు మేఘ రూపమును దాల్చి వేయి దివ్యసంవత్సరములు శంకరుని అత్యంత ఆదరముతోను బహుమానముతోను వహించెను.

విశేషము : కల్ప భేదములను బట్టి సృష్టి, స్థితి లయముల క్రమములో కథా భేదముండునని గ్రహించవలెను.

దృష్ట్వా భావం మహాదేవో హర్షాత్స్వాత్మని శంకరః
ప్రదదౌ తస్య సకలం స్రష్టుంవై బ్రహ్మణా సహ 19
తదాతం కల్పమాహుర్వై మేఘవాహన సంజ్ఞయా
హిరణ్యగర్భస్తం దృష్ట్వా తస్యాదే హోఽభ్యవస్తదా 20
జనార్దనసుతః ప్రాహ తపసా ప్రాప్యశం కరమ్
తవ వామాంగజో విష్ణుః దక్షిణాంగ భవోహ్యహమ్ 21
మయా సహజగత్సర్వం తథాప్య సృజ దచ్యుతః
జగద్రక్షామహవద్యస్మాన్మే మేఘాభూత్వాది వానిశం 22

భవంత మవహద్విష్ణు ర్దేవదేవం జగద్గురుమ్
నారాయణాదపి విభో భక్తోహం తవ శంకర
ప్రసీద దేహిమే సర్వం సర్వాత్మత్వం తవ ప్రభోః 23

తా : మహాదేవుడగు శంకరుడు విష్ణువుయొక్క భావమును గ్రహించి బ్రహ్మతో సహా సర్వమును సృష్టించు శక్తినిచ్చెను ఆ కాలమును మేఘవాహన కల్పమందురు. జనార్దన దేహసంభవు డగు బ్రహ్మ తపస్సుచే శంకరుని ప్రార్థించి శంకరా! విష్ణువు నీకు వామాంగజుడు నేను దక్షిణాంగభవుడను గదా. అట్టితరి విష్ణువు నాతోగూడ జగత్తునంతను సృష్టించి మేఘవాహుడై దేవ దేవుడవగు నిన్నుగూడ రాత్రింబవళ్ళు వహించెను. నారాయణుని కన్న నేను నీయందెక్కుడు భక్తి గలవాడను గాన, నన్ననుగ్రహించి నీ సర్వాత్మత్వమునంతను నా కొసంగుము. అని వేడు కొనెను

శ్లో తదాథలబ్ధ్వా భగవాన్ భవాత్సర్వాత్మతాం క్షణాత్ 24
త్వరమాణోథ సంగమ్య దదర్శ పురుషోత్తమం
ఏకార్ణవాలయే శుభ్రే త్వంధకారేసు దారుణే 25

హేమ రత్న చితేదివ్యే మనసా చవినిర్మితే
దుష్ప్రాప్యే దుర్జనైః పుణ్యైః సనకాద్యైర గోచరే 26

జగదావా సహృదయం దదర్శ పురుషం త్వజః
అనంత భోగ శయ్యాయాం శాయినం పంకజేక్షణం 27

శంఖ చక్ర గదా పద్మం ధారయంతం చతుర్భుజం
సర్వాభరణ సంయుక్తం శశిమండల సన్నిభం 28

శ్రీవత్స లక్షణం దేవం ప్రసన్నాస్యం జనార్దనం
రమా మృదుకరాం భోజ స్పర్శ రక్త పదాంబుజం 29

పరమాత్మాన మీశానం తమసా కాలరూపిణం
రజసా సర్వలోకానాం సర్గలీలా ప్రవర్తకం 30

సత్వేన సర్వభూతానాం స్థాపకం పరమేశ్వరం
సర్వాత్మానం మహాత్మానం పరమాత్మాన మీశ్వరం 31

క్షీరార్ణవేఽమృతమయే శాయినం యోగనిద్రయా
తం దృష్ట్వా ప్రాహవై బ్రహ్మ భగవంతం జనార్దనం
గ్రసామిత్వాం ప్రసాదేన యథాపూర్వం భవానహం 32

తా : అప్పుడు శంకరుని వలన సర్వాత్మత్వమును పొంది బ్రహ్మ శీఘ్రముగ పురుషోత్తముని చేరి దర్శించెను. పురుషోత్తముడు క్షీరార్ణవమందు మహాంధకారములో మనోరంచితమైన స్వర్ణ రత్న ఖచితమై దుర్జనులకు దుష్ప్రాప్యమును సనకాది పుణ్య పురుషులకు కూడ అగోచరమును, జగన్నివాస భూతమగు హృదయము గల పురుషోత్తముని బ్రహ్మ దర్శించెను. పురుషోత్తముడు శేషశాయియై, పంకజేక్షణుడుడై, శంఖ చక్ర గదా పద్మధారియై చతుర్భుజుడై, సర్వాభరణ భూషితుడై, చంద్రమండల సమానుడై శ్రీవత్సలాంఛితుడై, ప్రసన్నాననుడై యుండెను. జనార్దనుడు

రమా మృదు కరకమల స్పర్శకు కూడ సహింపక ఎఱ్ఱగా కందిన సుకుమార పదాంబుజములు గల్గియుండెను. పరమాత్మగా సర్వ జ్ఞానకుండును. తపస్సుచే కాలరూపుడుగను, రజస్సుచే సర్వలోక సృష్టి లీలాప్రవర్తకుడుగను సత్వగుణముచె సర్వభూతములను రక్షించువానిగను, సర్వస్వరూపుడగు పరమాత్మగ అచ్యుతుండు క్షీరార్ణవమునందు యోగ నిద్రాసక్తుడై యుండెను.

అట్టి జనార్దనుని బ్రహ్మ దర్శించి శివకృపచే నీవు మున్ను ఎట్లు శివుని స్థాపనము చేసికొంటివో అట్లే నిన్ను నేను వశ్యుని చేసుకొనుచున్నాను. అనెను.

శ్లో॥ స్మయమానస్తు భగవాన్ ప్రతిబుధ్య పితామహం 33
ఉదైక్షత మహాబాహుః స్మితమీషచ్చకారసః ।

వివేశ చాండ జంతం తుగ్రస్తసేన మహాత్మనా 34
తతస్తంచా సృజద్బ్రహ్మ భ్రువోర్మధేన చాచ్యుతమ్
సృష్టిస్తేన వారిః ప్రేక్ష్య స్థితస్తస్యాథ సన్నిధౌ 35

తా : అంత జనార్దనుడు పితామహుని చూచి చిరునవ్వు నవ్వెను. అదియునుగాక బ్రహ్మచే పట్టుబడినవాడై బ్రహ్మలో ప్రవేశించెను. ఇట్లు విష్ణువుచే ఆవేశింపబడినవాడై బ్రహ్మ తన భ్రూమధ్యము నుండి అచ్యుతుని సృష్టించెను. ఇట్లు బ్రహ్మచే సృష్టింపబడిన విష్ణువు బ్రహ్మను చూచి అతని చెంతనే నిలచెను.

శ్లో॥ ఏతస్మిన్నంతరేరుద్రః సర్వదేవ భవోద్భవః
ఏకృతం రూపమాస్థాయ పురాదత్త వరస్తయోః 36

అగచ్ఛద్యత్రవై విష్ణుః విశ్వాత్మా పరమేశ్వరః
ప్రసాదము తులం కర్తుం బ్రహ్మణశ్చ హరేః ప్రభుః 37

తతః సమేత్యతే దేవాః సర్వదేవ భవోద్భవమ్
అపశ్యతాం భవం దేవం కాలాగ్ని సదృశం ప్రభుమ్ః 38

తౌతం తుష్టువతుశ్చైవ శర్వముగ్రం కపర్దినమ్
ప్రణేమతుశ్చ వరదం బహుమానేన దూరతః 39

భవోపి భగవాన్ దేవ మనుగృహ్య పితామహ
జనార్దనం జగన్నాథం తత్రైవాంతర ధీయత 40

ఇతి లింగమహాపురాణే పూర్వభా
బ్రహ్మణో వర ప్రసాదో నామ
సప్తత్రింశోధ్యాయః - 37

తా : ఇంతలో సర్వదేవ భవోద్భవుడగు రుద్రుడు పూర్వము బ్రహ్మ విష్ణువులకు వరమిచ్చిన వాడయ్యెను. వారికి విశేషానుగ్రము చేయుటకు వికృత రూపముతో కనుపట్టెను. వారిద్దరు కాలాగ్ని సదృశుడైన శర్వుని, ఉగ్రునిగను. కపర్దిగను దర్శించి దూరముగ నమస్కరించిరి. శంకరుడును. ఆ పితామహ జనార్దనులను అనుగ్రహించి అంతర్థాను డాయెను.

ఇట్లు లింగ మహాపురాణ పూర్వాభాగమున, బ్రహ్మకు వర ప్రసాదానమును ఋప్పుదియొయదిన అధ్యాయము.

****

యత్నేవా విధవా త్పరస్పర ఘనా శ్రీ బ్రహ్మ
నారాయణౌ॥ సర్వజ్ఞౌ జగతాం నివాస హృదయౌ
సర్గస్థితి చక్రిణః ॥ తత్నేనా పరమేశ్వరస్య
దయితా యుక్తస్య పాదాంబుజం దేవై రింద్ర
ముఖై : కిరీటమణిభి దీపాలి నీరాజితం॥

****

ఇతి కుమారపృష్ఠి శైలాది కృత స్వోద్భవ
కధనప్రసంగేన - బ్రహ్మ విష్ణోః సముత్ప
ఎమయే కలహాయ మానయోః శివ వరదాన వర్ణనమ్ ॥

37 - అధ్యాయము

****

శ్రీ లింగమహాపురమలో 41వ అధ్యాయమునందు 60 శ్లోకము నుండి 64 శ్లోకము వరకు ఇంద్రుడు శిలాదునకు మృత్యు హీనుడగు పుత్రుడు రుద్రప్రసాదముననే కల్గునని చెప్పెను.

41 అధ్యాయం - 60 శ్లోకం

ఇంద్ర ఉవాచ :

తస్మాచ్ఛిలాద లోకేమ దుర్లభో వైత్వయోనిజం:
మృత్యుహీనః సుమాన్ విద్దిన మృత్యుః పద్మజోపిన: 60

కింతు దేవేశ్వరో రుద్రః ప్రసీదతి యదీశ్వరః
స దుర్లభో మృత్యుహీనస్తవ పుత్రోహ్యయోనిజః 61

మయాచ విష్ణు నాచైవ బ్రహ్మణాచ మహాత్మనా
అయోనిజం మృత్యుహీన మసమర్థం నివేదితుం. 62

తా ; కావున శిలాదుడా అయోనిజుడు మృత్యుహీనుడు అగు కుమారుడు దుర్లభుడు. బ్రహ్మకూడా మృత్యువు కలవాడే. కాని సర్వేశ్వరుడైన రుద్రుడు అనుగ్రహించిన అయోనిజుడు మృత్యుహీనుడు అగు పుత్రుడు నీకు కలుగగలడు. అట్టి వరదాన శక్తి విష్ణువునకుగాని, బ్రహ్మకుగాని, ఇంద్రుడనైననాకుగాని లేదు

శ్లో॥ ఏవం వ్యాహృత్య విప్రేంద్ర మనుగృహ్యచ తంప్రభుః
దేవైః వృతోయయౌ దేవః సితేనేభేనవై ప్రభు 64

తా ॥ దయామయుడైన ఇంద్రుడు శైలాదునితో నిట్లనిచెప్పి ఐరావతము నెక్కి వెడలెను.

ఇతి శ్రీ లింగ మహాపురాణే పూర్వభాగే
ఇంద్రవాక్యం నామ ఏక చత్వారింశోధ్యాయః 41

శ్రీ లింగమహాపురాణం - 42 అధ్యాయము

# శిలాదుని తపస్సుకు మెచ్చి మహేశ్వరుడు వరమిచ్చుట - నందికేశ్వరోత్పత్తి

సూత ఉవాచ :

గతే పుణ్యేచ వరదే సహస్రాక్షే శిలాదః
ఆరాధ యన్మహాదేవం తపసాఽతోష యద్భవమ్॥ 1
అవతారిక : ఇంద్ర గమనానంతర వృత్తాంతమును చెప్పుట

తా : వరదుడైన దేవేంద్రుడు వెడలిన తరువాత శిలాదుడు మహాదేవుని ఆరాధించుచు తపస్సుచే సంతుష్టుని చేసెను.

శ్లో॥ అథ తస్యైవమనిశం తత్పరస్య ద్విజస్యతు
దివ్యం వర్ష సహస్రంతు గతం క్షణమివాద్భుతం॥ 2
వల్మీకే నా వృతాంగశ్య లక్షః కీటగణైర్మునిః
వజ్రీ సూచీ ముఖైశ్చాన్యైః రక్త కీటైశ్చ సర్వతః 3
నిర్మాంస రుధిరత్వంగైః విర్లేపః కుడ్యవత్స్థిత
అస్థిశేషోఽభవ త్పశ్చాత్తమ మన్యత శంకరః 4
(అమన్యత బుద్ధవానిత్యర్థః)

తా : అనంతరము శిలాదునకు నిరంతర శివధ్యాన తత్పరత్వమున అద్భుతముగ వేయి దివ్యవర్షములు క్షణమాత్రముగ

గడచినవి. శరీరము పుట్టలతో కప్పబడి క్రిమికీటకాదులచే కప్పబడి రక్తమాంసములు లేక లేపహీనమైన గోడవలె శల్యావశిష్టము కాగా శంకరుడు గమనించెను.

శ్లో॥ యదా స్పృష్టో మునిస్తేన కరేణచ స్మరారిణా
తదైవముని శార్దూలశ్చోత్స సర్జక్రమం ద్విజః 5

తపతస్తస్య తపసా ప్రభుస్తుష్టావ శంకరః
తుష్టస్తవేత్యథో వాచ సగణశ్చో మయాసహ 6

తపసానేన కిం కార్యం భవతస్తే మహామతే
దదామి పుత్రం సర్వజ్ఞం సర్వశాస్త్రర్థ సాగరమ్ 7

తతః ప్రణమ్య దేవేశం స్తుత్వోవాచ శిలాశనః
హర్షగద్గద యావాచా సోమం సోమ విభూషణం 8

(ఉమయా సహితం చంద్రకళా ధరం)

తా ; శంకరుని కర స్పర్శచే శిలాదుడు తపోక్లేశము నుండి ముక్తుడాయెను. అతని తపస్సునకు శంకరుడు సంతుష్టుడాయెను శివగణములతోను పార్వతితోను శిలాదుని తపస్సునకు సంతసించితి ననియు, నీ కేవరము కావలయునో కోరుకొమ్మని చెప్పి సర్వజ్ఞుడు, సర్వశాస్త్రర్థ పారగుడునగు పుత్రుని ప్రసాదింతునని వర మిచ్చెను. అంత శిలాదుడు పార్వతితో కూడిన చంద్రకళాధరుని దర్శనమునకు ఆనందభరితుడై గద్గదవాక్కులతో నిట్లనెను.

శిలాద ఉవాచ :

శ్లో॥ భగవన్దేవ దేవేశ త్రిపురార్దన శంకర
అయోనిజం మృత్యుహీనం పుత్రమిచ్ఛామి సత్తమ 9

తా : దేవదేవ! త్రిపురాంతక శంకరా! అయోనిజుడు మృత్యురహితుడు అగు పుత్రుని ప్రసాదింపుమని కోరెను.

సూత ఉవాచ ;

శ్లో॥ పూర్వమారాధితః ప్రాహతపసా పరమేశ్వరః
శిలాదం బ్రహ్మణా రుద్రః ప్రీత్యా పరమయా పునః 10

తా : పూర్వము బ్రహ్మచే ఆరాధింపబడిన పరమేశ్వరుడు మహాప్రీతితో శిలాదునితో నిట్లనెను.

శ్రీ దేవదేవ ఉవాచ ;

శ్లో॥ పూర్వమారాధితో విప్ర బ్రహ్మణాహం తపోధన
తపసా చావతారార్థం మునిభిస్తు సురోత్తమైః 11

తవ పుత్రో భవిష్యామి నంది నామాఽత్వయోనిజః
పితా భవిష్యసి మమ పితుర్వై జగతాం మునే 12

ఏవముక్త్వా మునింప్రేక్ష్య ప్రణిపత్య స్థితం ఘృణీ
సోమః సోమోపమః ప్రీతః తత్రైవాంతర ధీయత 13

తా : పూర్వము బ్రహ్మచే నారాధింపబడిన రుద్రుడు శిలాదుని అరాధన వలన మిక్కిలి ప్రీతుడై శిలాదునితో నిట్లనెను.

నేను, దేవతలతో గూడిన బ్రహ్మ నన్నవతరింప పూర్వము ప్రార్థించెననియు ఇప్పుడు నీవుకూడ ప్రార్థించుటచే జగత్తులకే తండ్రినగునేను నీకు "నంది" అను పేరుతో అయోనిజుడనైన పుత్రునిగా నగుదుననియు నీవు నాకు తండ్రివి కాగలవనియు చెప్పి అంతర్ధానుడాయెను.

శ్లో॥ లబ్ధపుత్రః పితారుద్రా త్ప్రీతో మమ మహామునే
యజ్ఞాంగణం మహత్ప్రాప్య యజ్ఞార్థం యజ్ఞ విత్తమః 14
తదంగణా దహం శంభోస్సనుజః తస్యచాజ్ఞయా
సంజాతః పూర్వమేవాహం యుగాంతాగ్ని సమప్రభః 15

వవర్షుస్తదా పుష్కరావర్త కాద్యా
జగుః ఖేచరాః కిన్నరాః సిద్ధసాధ్యాః
శిలాదాత్మజ త్వాంగతేమ యుపేంద్రః
ససర్జాథవృష్టిం సుపుష్పౌఘ మిశ్రాం 16

తా : ఓ మునీశ్వరా నా తండ్రి రుద్రుని వర ప్రసాదమున లబ్ధపుత్రుడై యజ్ఞార్థము యజ్ఞభూమిని చేరెను. ఆ యజ్ఞాంగణము నందు నేను ప్రళయకాల అగ్ని సమప్ర గలవాడనై యుద్భ వించితిని . పుష్కరావర్తక మేఘములు. ఖేచరులు, కిన్నర సిద్ధ సాధ్యులు ఉపేంద్రుడు మున్నగువారందరు పుష్పవర్షమునుకురిసిరి

శ్లో॥ మాంద్రుష్ట్వా కాల సూర్యాభం జటాముకుట ధారిణం
త్ర్యక్షం చతుర్భుజం బాలం శూలటంక గదాధరం 17

వజ్రబాహుం వజ్రపంష్ట్రించ వజ్రబాహ్వాధితం శిశుం
వజ్రకుండలినం ఘోరం నీరదోపమనిస్వనమ్ 18

బ్రహ్మాద్యాస్తుష్టువుస్సర్వే సురేంద్రశ్చ మునీశ్వరాః
నేదు' పపాతతః సర్వే ననృత్యుశ్చాప్సరో గణాః 19

ఋషయో ముని శార్దూల ఋగ్యజుస్సామ సంభవైః
మంత్రై మహేశ్వరై స్తుత్వా సంప్రణేమ్ ముదాన్వితాః 20

బ్రహ్మహరిశ్చ రుద్రశ్చ శక్రః సాక్షాచ్ఛివాంబికా
జీవశ్చేందు మహాతేజా భాస్కరః పవనో౽లః 21

ఈశానో నిరృతిర్యక్షో మహోవరుణ ఏవచ
విశ్వేదేవ స్తథా రుద్రా వసవశ్చ మహాబలాః 22

లక్ష్మీః సాక్షాచ్ఛచే జ్యేష్టా దేవిచైవ సరస్వతీ
అదితిశ్చదితిశ్చైవ శ్రద్ధాలజ్జా ధృతిస్తథా 23

నందా భద్రాచ సురభీ సుశీలా సుమనాస్తథా
వృషేంద్రశ్చ మహాతేజా ధర్మో ధర్మాత్మజస్తదా 24

ఆవృత్యమాంతథాలింగ్య తుష్టు వుర్మునిసత్తమ
శిలాదోపి మునిర్దృష్ట్వా పితామేతా దశంతదా 25
ప్రీత్యా ప్రణమ్య పుణ్యాత్మా తుష్టావేష్ట ప్రదం సుతం

తా : కాలసూర్యునివలె **నున్న** నన్ను జటామకుట ధారి
ను, త్రినేత్రునిగను, చతుర్భుజునిగను, బాలునిగను, శూలటంక

గదాధరునిగను, వజ్రాయుధునిగను, వజ్రదంష్ట్రునిగను, వజ్రధారి యగు ఇంద్రునిచే సేవింపబడిన వానినిగను, వజ్రకుండలములతో ఘోరరూపమున నీలమేఘచ్ఛాయతో నున్న నన్ను చూచి బ్రహ్మేంద్రాదులు స్తుతించిరి అప్సరోగణములు నాట్యము చేసిరి, ఋషులు వేదమంత్రములతో స్తుతించిరి. నమస్కరించిరి బ్రహ్మ, హరి, రుద్రుడు, ఇంద్రుడు, పార్వతి, గురుచంద్రరాహువులు, వాయువు అగ్ని, ఈశానుడు, నిరృతి, యక్షులు యముడు, వరుణుడు, విశ్వే దేవతలు. ఏకాదశరుద్రులు, అష్టవసువులు లక్ష్మీదేవి, శచీదేవి, జ్యేష్ఠాదేవి, సరస్వతి, అదితి, దితి, శ్రద్ధా, లజ్జ, ధృతి, నందా భద్రా, సురభి, సుశీలా, సుమనా, మున్నగు వారందరు నాచుట్టూ చేరి నన్నా లింగనము చేసి స్తుతించిరి. నాతండ్రి అయిన శిలాదుడు కూడ తన ఫలఃఫలమయిన నన్ను సంతోషముతో స్తుతింపసాగెను,

శిలాద ఉవాచ :

శ్లో॥ భగవన్దేవదేవేశ త్ర్యంబక మహావ్యయ 26

పుత్రోసి జగతాం యస్మాత్త్రాతా దుఃఖాద్ధి కింపునః
రక్షకో జగతాం యస్మాత్పితామే పుత్రసర్వగ 27

అయోనిజ నమస్తుభ్యం జగద్యోనే పితామహ
పితాపుత్రమహేశాన జగతాంచ జగద్గురో 38

వత్సవత్స మహాభాగ పాహిమాం పరమేశ్వర
త్వయాహం నందితోయస్మా న్నందీ నామ్నా సురేశ్వర 29

తస్మాత్త్వం యమహం నందిన్నమామి జగదీశ్వరమ్
ప్రసీద పితరేమేద్య రుద్రలోకం గతే విభో 30

పితామహశ్చభో నందిన్నవతీర్ణే మహేశ్వరే
మమైవ సఫలో లోకే జన్మవై జగతాం ప్రభో 31

తా : భగవాన్! దేవదేవ! త్ర్యంబక. అవ్యయ జగద్రక్షకుడవైన నీవు నాకు పుత్రుడవైతివి, ఇంతకన్న నాకేమి కావలయును? సర్వ వ్యాపకుడవగు నీకు నమస్కారము. నీవు జగత్కారకుడవు. అయోనిజుడవు, జగత్తులకు పితా, పితామహాది రూపము లన్నియు నీవే జగద్గురో! పరమేశ్వరుడవైనను నాకు పుత్రరూపమున ఆవిర్భవించిన నీవు నన్ను రక్షింపుము. నీ జన్మచే నేను నందిపొందితి గాన "నంది" అను సార్థకనామముండు కమ్ము, జగదేశ్వరా! నీకు నమస్కారము. ఈ నీ జన్మచే నాపితృపితామహులందరు రుద్ర లోకం చేరిరి. నా జన్మ ధన్యమైనది.

శ్లో॥ అవతీర్ణే సుతేనందిన్ రక్షార్థం మమ్యామీశ్వర
తుభ్యం నమః సురేశాన నందీశ్వర నమోస్తుతే 32

పుత్రపాహి మహాబాహో దేవదేవ జగద్గురో
పుత్రత్వమేవ "నందీశ" మత్వా యత్కీర్తితంమయా 33

త్వయా తత్క్షతద్యుతాం వత్స స్తవ్య స్తవ్య సురాసురైః
యఃపఠేచ్ఛృణుయాద్వాపి మమ పుత్రప్రభాషితం 34

శ్రావయేద్వా ద్విజాన్ భక్త్యామయా సార్థంసమోదతే
ఏవంస్తుత్వా సుతంబాలం ప్రణమ్య బహుమానతః 35

మునీశ్వరాంశ్చ సంప్రేక్ష్య శిలాదోవాచ సువ్రతః
పశ్యధ్వం మునయస్సర్వే మహాభాగ్యం మమావ్యయ 36

నంది యజ్ఞాంగణే దేవశ్చావతీర్ణోయతః ప్రభుః
మత్సమఃకఃపుమాన్‌లోకే దేవోవా దానవోపివా 37

ఏష నందీయతో జాతో యజ్ఞభూమౌ హితాయమే 38
ఇతి శ్రీ లింగపురాణే పూర్వంభాగే నందికేశ్వరోత్పత్తి

ర్నామ ద్విచత్వారిం శోధ్యాయః 42

తా : నందీశ్వరా! నా రక్షకొరకు నీవు అవతరించిన నీకు నమస్కారము, దేవదేవ, జగద్గురో, పుత్ర నన్ను రక్షింపుము, సురాసురులచే స్తుతింప యోగ్యుడవైన నిన్ను పుత్రునిగా భావించి పలికిన పలుకులకు క్షమింపుము. హే నందీశ! నంది రూపుడవైన శివా! నిన్ను పుత్రమాత్రునిగా భావించుట అపరాధము గాన నన్ను క్షమింపుము. ఈ సంభాషణను ఎవరు పంఠితురో, వీందురో విని పంతురో. వారందరు నాతో సమానమైన పరమానంద భాజనులు కాగలరు.

ఇట్లు బాలరూపుడైన కుమారుని స్తుతించి, భక్తితో నమస్కరించి, మునీశ్వరులతో, నా మహాభాగ్యమును గమనింపుడు పరమేశ్వరుడే నా యజ్ఞ భూమియందు అవతరించెను. దేవ దానవ

లలో నాతో సమానుడైన పుణ్యాత్ముడెవడైనను కలడా? భగవంతుడే "నంది"గా నా ఇంట అవతరించెను.

శిలాదునిచే పాటింపబడిన తపః ఫలముగా యజ్ఞభూమి యందు "నంది"గా అవతరించిన భగవానుడు సర్వులను నందింప జేయుగాక,

ఇతి లింగమహాపురాణమున 42 వ అధ్యాయము



43వ అధ్యాయము

## మానుష రూపమును పొందిన "నంది" రుద్రారాధన వలనమహాప్రసాదము నందుట

నందికేశ్వర ఉవాచ :

శ్లో॥ మయా సహ పితాహృష్టః ప్రణమ్యాచ మహేశ్వరం
ఉటజం స్వంజగామాసు నిధింలబ్ధ్వేవ నిర్ధనః 1
యదాహి గతోహముటజం శిలాదస్య మహామునేః
తదా వైదైవికం రూపం త్యక్త్వా మానుష్య మాస్థితః 2
నష్టా చైవస్మృతిర్ది వ్యాయేనకే నాపి కారణాత్
మానుష్య మాస్థితం దృష్ట్వా పితామే లోకపూజితః 3

విలలాపాతి దుఃఖార్తః స్వజనైశ్చ సమావృతః
జాతకర్మాది కార్యైశ్చైవచ కారమమ సర్వవిత్ 4

శాలంకాయన పుత్రోవై శిలాదః పుత్రవత్సలః
ఉపదిష్టా హితే నైవ ఋక్సామ్ యజు షస్తథా 5

సామశాఖా సహస్రంచ సాంగో పాంగం మహామునే
ఆయుర్వేదం ధనుర్వేదం గాంధర్వం చాశ్వ లక్షణం 6

హరితానాం చరితం చైవన రాణాంచైవ లక్షణం
సంపూర్ణే సప్తమేవర్షే తదోథముని పత్తమైః 7

తా : నా తండ్రి శిలాదుడు మహేశ్వరునకు నమస్కరించి నన్ను తీసుకొని తన కుటీరమునకు చేరెను. మా కుటీరమునకు చేరగానే నాకు దైవికరూపము పోయి మానుషరూపమొచ్చినది, యే కారణముననో గాని నా దివ్యస్మృతి పోయినది. నా పరిస్థితి చూచి నా తండ్రి స్వజనముతో కూడి విలపించెను. శాలంకాయనపుత్రుడగు శిలాదుడు పుత్రప్రేమతో నాకు జాతకర్మాదులు నిర్వహించెను. నాకు సాంగోపాంగముగ నాల్గువేదములు, ఆయుర్వేద, ధనుర్వేద, గాంధర్వ వేదాదులు, అశ్వలక్షణములు, హారీతాదుల చరిత్ర మున్నగునవి ఏడవయేటికే ముని సత్తములచేత బోధింప చేసెను.

శ్లో॥ మిత్రావరుణ నామనౌ తపోయోగ బలాన్వితౌ
తస్యాశ్రమం గతౌ దివ్యౌ ద్రష్టుం మామాజ్ఞాయా విభోః 8

ఊచతుశ్చ మహాత్మానౌ మాం నిరీక్ష్య ముహుర్ముహుః
తాతనంద్యయ మల్పాయుః సర్వశాస్త్రార్థ పారగః 9

నదృష్ట మేవమాశ్చర్య మాయుర్వరాదతః పరం
ఇత్యుక్తవతి విప్రేంద్రః శిలాదః పుత్రవత్సలః 10

సమాలింగ్య చదుఃఖార్తో రురోదాతీవ విస్వరమ్
హా పుత్ర పుత్రేతి పపాత చ సమంతతః 11

అహోబలం దైవ విదేః విధాతుశ్చేతి దుఃఖితః

తా : తపోయోగ బల యుక్తులగు మిత్రావరుణులు ఈశ్వరాజ్ఞచే నన్ను చూచుటకు ఆశ్రమమునకు విచ్చేసిరి. ఆ మహాత్ములు పలుమారు నన్నుచూచి అయ్యా! సర్వ శాస్త్రార్థ పారగుడగు నంది అల్పాయుష్మంతుడు. ఒక సంవత్సరము పైన జీవింపడని చెప్పగా శిలాదుడు పుత్రవాత్సల్యముతో నన్ను కౌగలించుకొని పుత్ర పుత్ర అని నేలబడి దుఃఖింపసాగెను.

శ్లో॥ తస్యచార్త స్వరం శృత్వా తదాశ్రమ నివాసినః 12
నిపేతుర్విహ్వ లాత్యర్థం రక్షశ్చ క్రుశ్చ మంగళమ్
తుష్టువుశ్చ మహాదేవం త్ర్యంబక ముమాపతిం 13

హుత్వా త్ర్యంబ కేనైవ మధునైవచ సంప్లుతాం
దూర్వామయుత సంఖ్యాతాం సర్వద్రవ్య సమన్వితాం 14

పితావిగత సంజ్ఞశ్చ తాథాచైవ పితామహః
నిచేష్టశ్చ లలాషాసా మృతవన్నిప పాతచ 15

తా : అతని ఆర్తస్వరమును విని ఆశ్రమ వాసులు చకితులై రక్షామంత్రములు మంగళాశాసనములు నిర్వహించి మహాదేవుని త్ర్యంబక మంత్రములతో స్తుతించి, మధుప్లుతములైన దూర్వలతో పదివేలు హోమములు చేసిరి. నా తండ్రియు, తాతయు స్పృహతప్పి చేష్టలుడిగి పడిపోయిరి.

శ్లో॥ మృత్యోర్భీతో హమ చిరాచ్ఛిరసా భాభివంద్యతం
మృత వత్పతితం సాక్షాత్పితరంచ పితామహం 16

ప్రదక్షిణీ కృత్యచతం రుద్రజాప్య రతోఽభవం
హృత్పుండరీకే సుషిరే ధ్యాత్వా దేవం త్ర్యంబకం 17

త్ర్యక్షం దశభుజం శాంతం పంచవక్త్రం సదాశివం
సరితశ్చాంతరే పుణ్యే స్థితం మాం పరమేశ్వర : 18

తుష్టో బ్రవీన్మహాదేవ : సోమ : సోమార్ధ భూషణ :
వత్స నందిన్మహా బాహో మృత్యోర్భీతి : కుతస్తవ 19

మయైవ ప్రేషితౌ విప్రౌ మత్సమస్త్వంన సంశయః
వత్సేనత్తవదేహంచ లౌకికం పరమార్థతః 20

నాస్త్యేవ దైవికం దృష్టం శిలాదేన పురాతనః
దేవైశ్చ మునిభిఃసిద్ధైః గంధర్వైర్ధానవోత్తమైః 21

పూజితం యత్పురావత్స దైవికం నందికేశ్వర
సంసారస్య స్వభావోయం సుఖం దుఃఖం పునఃపునః 22
నృణాంయోని పతతిత్యాగః సర్వథైవ వివేకినః

తా: మృత్యువు వలన భయపడి మృతులవలె పడిపున్న తండ్రి తాతలకు నమస్కరించి, ప్రదక్షిణలు చేసి రుద్ర మంత్ర జప పారాయణుడ నైతిని. సూక్ష్మమయిన హృత్పుండరీకమందు సదాశివుని త్రినేత్రునిగను, దశభుజునిగను, శాంతునిగను, పంచ వదనునిగను ధ్యానించితిని అంత పరమేశ్వరుడు శశి కళాధరుడును పార్వతీ సమేతుడును నయి సంతుష్టుడై నాతో వత్సా, నందీ : నీకు మృత్యుభీతి ఎక్కడది? ఆ ఇద్దరు బ్రాహ్మణులు నాచే పంపబడిన వారు. నీవు నాతో సమానుడవు. సందేహము లేదు. నాయనా: నీ యీ దేహము లౌకికము, పరమార్ధముగ లేదు. శిలాదుడు, దేవ, మునులు, గంధర్వులు పూజించిన నీ దేహము దైవికమైనది. సుఖ దుఃఖ పరంపర సంసార స్వభావము,

శ్లో॥ ఏవముక్త్వా తుమాం సాక్షాత్సర్వ దేవ మహేశ్వరః 23

కరాభ్యాం సుశుభాభ్యాం చ ఉభాభ్యాం పరమేశ్వరః
పస్పర్శ భగవాన్ రుద్రః పరమార్తి హరోహరః 24

ఉవాచ చ మహాదేవస్తుష్టాత్మా వృషభధ్వజః
నిరీక్ష్యగణ పాంశ్చైవ దేవీం హిమవతః సుతాం 25

సమాలోక్య చతుష్టాత్మా మహాదేవః సురేశ్వరః
అజరోజ రయాత్యక్తో నిత్యం దుఃఖ వివర్జితః 26

అక్షయాశ్చవ్యయశ్చైవ సపితాస సుహృజ్జనః
మమేష్టో గణపశ్చైవ మద్వీర్యో మత్పరాక్రమః 27

ఇష్టోమమ సదాచైవ మమ పార్శ్వ గతస్సదా
మచ్ఛల శ్చైవ భవితా మహాయోగ బలాన్వితః 28

తా : సర్వదేవ మహేశ్వరుడు ఇట్లని నన్ను తన రెండు శుభకరములతో స్పృజించి గణాధిపతులతోను పార్వతితోను సంతుష్టుడై నన్ను అజరుడువు, దుఃఖరహితుడవు అయి నీ తండ్రి తోను, స్నేహితులతోను నాకిష్టుడవు, గణాధిపతివి, నాతో సమానమగు వీర్య పరాక్రమములు కల్గి నాదగ్గరనే మహాయోగ బలాన్వితుడవై యుండెదవని చెప్పెను.

శ్లో॥ ఏవ ముక్త్వాప్రచమాం దేవో భగవాన్ సగణస్తదా
కుశే శయ మయీంమాలాం సమున్ముచ్యాత్మనః తదా 29

ఆ బబంధ మహాతేజా మమదేవో వృషధ్వజః
తయాహం మాలయాజాతః శుభయా కంఠ సక్తయా 30

త్ర్యక్ష్యోదశ భుజశ్చైవ ద్వితీయఇవ శంకరః

తా : ఇట్లని భగవంతుడు తన దేహము నుండి పద్మమాలను తీసి నాకు అలంకరించెను. ఆ మాల నా కంఠము నలంకరించగనే నేను త్రినేత్రుడను దశభుజుడను అయి రెండవ శంకరుడ నైతిని.

శ్లో॥ తతఏవ సమాధాయ హస్తేన పరమేశ్వరః - 31
ఉవాచ బ్రూహి కింతేద్య దదామి వరముత్తమం
తతో జటా శ్రితంవారి గృహీత్వాచాతి నిర్మలమ్ 32

ఉక్తా నదీభవ స్వేతి ఉత్ససర్జ వృషధ్వజః
తతః సాదివ్యతో యాచ పూర్ణా సితజలా శుభా 33

పద్మోత్పల వనోపేతా ప్రావర్తత మహానదీ
తామాహచ మహాదేవో నదీం పరమ శోభనామ్ 34

యస్మాజ్జటోధ కాదేవ ప్రవృత్తాత్వం మహానదీ
తస్మా జ్జటోదకా పుణ్యా భవిష్యసిః సరిద్వరా 35

త్వయిస్నాత్వా నరః కశ్చిత్సర్వ పాపైః ప్రముచ్యతే

తా : తరువాత పరమేశ్వరుడు నన్ను చేతితో పట్టుకొని నీ కేవరము కావలయునని అడిగెను. అనంతరము తన జటాజూటము నుండి నిర్మల నీటిధారను తీసి నది కమ్మని విడువగా అది దివ్య జలమయ ప్రవాహమయి తెల్లని జలముతో పద్మములు కలువలతో నిండి మహానది యాయెను. ఆ నది మహాదేవుని జటాజూటము నుండి వచ్చుటచే జటోదకమని పేరు పెట్టెను. అది పుణ్యానది యగుటయే గాక అందు స్నానము చేసినవారు సర్వపాప నిర్ముక్తు లగుదురని వరమిచ్చెను.

శ్లో॥ తతో దేవ్యా మహాదేవః శిలాదతనయం ప్రభుః 36
పుత్రస్తే యమితి ప్రాచ్య పాదయోః సన్న్యపాతయత్
సామామా ఘ్రాయ శిరసి పాణిభ్యాం పరిమార్జతి 37

పుత్రప్రేమ్ణాభ్యషిఞ్చంశ్చ స్రోతోభిస్తనయైః స్త్రీభిః
పయసాశం ఖగౌరేణ దేవదేవం నిరీక్షసా 38

తాని స్రోతాం సిత్రీణ్యస్యాః స్రోతస్వీన్యో భవంస్తదా
నదీం త్రిస్రోతసందేవో భగవాన వదత్ప్రభుః 39

త్రిస్రోతసంనదీం ప్పష్ట్వా వృషః పరమ హర్షితః
ననాదనాదాత్త స్మాచ్ఛసరి దన్యాతతో భవత్ 40

వృషధ్వని రితిఖ్యాతా దేవదేవేన సానదీ

తా : అంత మహాదేవుడు శిలాదతనయుని పార్వతి పాదములపై వైచి నీ పుత్రుడీతడనెను. పార్వతి నా శిరస్సు నాఘ్రాణించి చేతులతో నన్ను లాలించుచు పుత్ర ప్రేమతో సైసజములైన మూడు జలధారలతో నన్ను అభిషేకించుచు దేవదేవును చూచెను. శంఖ గౌరములగు క్షీరధారలను భగవానుడు త్రిస్రోసతమని పేర్కొనెను ఆ త్రిస్రోతస్సును చూచి వృషభుడు మహాసంతోషముతో రంకె యుగా ఆ నాదము నుండి మరొకనది పుట్టినది అ నదికి భగవానుడు వృషధ్వని యని పేరిడెను,

శ్లో॥ జాంబూ నదమయంఛత్రం సర్వరత్న మయం శుభం 41

స్వందేవశ్చాద్భుతం ద్యివం నిర్మితం విశ్వకర్మణా
ముకుటంబాబ బంధేశో మమమూర్ధ్ని వృషధ్వజః 42

కుంతలేచ శుభేదివ్యే వజ్ర వైడూర్య భూషితే
అబ బంధ మహాదేవ స్వయమేవ మహేశ్వరః 43

మాం తథాభ్యర్చితం వ్యోమ్నిదృష్ట్వా మేఘైః ప్రభాకరః
మేఘాంభసా భాభ్యషిం చచ్ఛిలాద మథోమునె 44

తా : శంకరుడు సర్వరత్న మయమయి విశ్వకర్మ నిర్మిత మయిన బంగారు కిరీటమును నాశిరస్సున నుంచెను. మహేశ్వరుడు వజ్ర వైడూర్య భూషితములైన కుండలములను నా కలంకరించెను ప్రభాకరుడు మేఘవారితో నా కభిషేకము చేసెను. తరువాత శిలా దుని కూడ అభిషేకించెను.

శ్లో॥ తస్యాభిషిక్తస్య తదా ప్రవృత్తా స్రోతసాభృశమ్
యస్మాత్సువర్ణాన్ని సృత్య నద్యేషా సంప్రవర్తతే 45

స్వర్ణోదకేతితాంమాహ దేవదేవ స్త్రింబకః
జాంబూనద మయాద్యస్మా ద్వితీయా ముకుటాచ్ఛుభా 46

ప్రావర్త తన దీపుణ్యా ఊచుర్జాంబూన దీతితాం
ఏ తత్పంచనదం నామ జప్యేశ్వర సమీపగం 47

యః పంచ నదమా సాద్యస్నాత్వా జప్యేశ్వరేశ్వరం
పూజయేచ్ఛివ సాయుజ్యం ప్రయాత్యేవన సంశయః 48

తా : అట్లభిషిక్తుడైన వానినుండి ప్రసరించిన నది నుండి సువర్ణము వెడలుటచే దేవదేవుడయిన శంకరుడు ఆ నదిని స్వర్ణో దకా అని పేర్కొనెను. జాంబూనదమయమయిన కిరీటము నుండి రెండవనది పుట్టుటచే దానిని పుణ్యప్రదమయిన జాంబూనది యని పేరిడిరి. యీ పంచనదులు జప్యేశ్వర సమీపమున నున్నవి. ఏ మానవుడు పంచనదమును చేరి స్నానమాడి జప్యేశ్వరుని పూజిం చునో అతడు శివసాయుజ్యము నందును, సందేహము లేదు.

శ్లో॥ అథదేవో మహాదేవః సర్వభూత పతిర్భవః
దేవీ మువాచ శర్వాణీ ముమాంగిరి సుతామ జాం 49

దేవి నందీశ్వరం దేన మభిషించామి భూత పం
గణేంద్రం వ్యాహరిష్యామి కిం వాత్వం
మన్య సేఽవ్యయ 50

తస్య తద్వచనం శ్రుత్వా భవానీ హర్షితా ననా
స్మయంతీ వరదం ప్రాహ భవం భూతపతిం పతిం 51

సర్వలోకాధిపత్యంచ గణేశత్వంత థైవచ
దాతు మర్హసి దేవేశ శైలాది స్తనయో మమ 52

తతస్స భగవాన్ సర్వః సర్వ లోకేశ్వరేశ్వరః
సస్మారగణపాన్ దివ్యాన్ దేవదేవో వృషధ్వజః 53

ఇతి శ్రీ లింగపురాణే నందికేశ్వర ప్రాదుర్భావ నంద కేశ్వరాభిషేకమంత్రోనామ త్రిచత్వారింశోధ్యాయః – 43

తా : అంత సర్వ భూతపతి యగు మహాదేవుడు పార్వతితో నిట్లనెను. దేవీ ! భూతపతి యగు నందీశ్వరుని అభిషేకించి గణాధిపతిగా చేయదలచితిని. నీ యభిప్రాయమేమి ? అని యడిగెను. అంత భవానీదేవి హర్షాతిరేకముతో నవ్వుచూ వరదుడయిన శంకరునితో "శిలాద నందనుడైన నంది నా కుమారుడు. అతనిని గణాధిపత్యముతోపాటు సర్వ లోకాధిపతిగా కూడ చేయవసినది" అని

కోరెను. అంత సర్వ లోకేశ్వరేశ్వరుడైన శంకరుడు దివ్యమైన దేవ గణాధిపతులను స్మరించెను.

ఇది శ్రీ లింగ మహాపురాణము నందు నందికేశ్వర ప్రాదుర్భావము, నందికేశ్వరాభిషేకము అను నలుబదిమూడవ (43) అధ్యాయము.

*******

43వ అధ్యాయములోని భావముతో నందీశ్వర ధ్యానము.

శ్లో॥ యోరుద్ర రుపోపి మహానుభావః
శైవాన్ సమాదేష్టు మథోహి నందీ॥
మానుష్య మాస్థాయ నిరస్తసంగో
జపాపరుద్రం తమహం నమామి॥

తా : యే నందీశ్వరుడు స్వయముగా రుద్రరూపుడైనప్పటికి శైవులను ఉద్ధరించుటకు మనుష్య దెహధారియై సంగదోశ వర్జితుడై రుద్రమును జపించెనో అట్టి "నంది" కి నమస్కారము.

*******

విశేషము : 43 వ అధ్యాయమున నందీశ్వరునకు మానుష రూపము లభించి రుద్రారాధన వలన భూతాధిపత్యము, గణాధిపత్యము లభించుటయే గాక పార్వతి అనుగ్రహము వలన సర్వలో కాధిపత్యము గూడ లభించినది.

కావున మహానందిక్షేత్రము కేవల ఈశ్వర వాహనమైన నందిగాకాక సర్వలోకాధి పతియగు పరమేశ్వరునితో సామ్యము గల్గుటచే మహోన్నతమగు దివ్యాతిదివ్య క్షేత్రముగా కూడ సేవింపదగినదిగా తెలియనగును.

* * * * *

44వ అధ్యాయము

చతుశ్చత్వారిం శకేతు నందినః సర్వ సంభృతః ।
గాణాపత్యేఽభిషేకోవై వివాహశ్చ నిరూప్యతే ॥

## నందీశ్వరునకు గాణాపత్యాభిషేకము - వివాహము

శైలాదిరువాచ :

శ్లో॥ స్మరణా దేవరుద్రస్య సంప్రాప్తాశ్చ గణేశ్వరాః
సర్వే సహస్ర హస్తాశ్చ సహస్రాయుధ పాణయః 1

త్రినేత్రాశ్చ మహాత్మానః త్రిదశైరపి వందితాః
కోటి కాలాగ్ని సంకాశా జటామకుట ధారిణః 2

దంష్ట్రా కరాళవదనా నిత్యా బుద్ధాశ్చ నిర్మలాః
కోటికోటి గణై స్తుత్యై రాత్మనాచ గణేశ్వరాః
అసంఖ్యాతా మహాత్మానః తత్రా జగ్ముర్ముదాయుతాః 3

గాయంతశ్చ ద్రవంతశ్చ నృత్యంతశ్చ మహాబలాః
ముఖాడంబర వాద్యాని వాదయంతస్త థైవచ 4

రథైర్నాగైర్హయైశ్చైవ సింహ మర్కట వాహనాః
విమానేషు తథా రుడాః హేమచిత్రేషు వైగణాః 5

భేరీ మృదంగ కాద్యైశ్చ పణవానక గోముఖైః
వాదిత్రైర్వివిధైశ్చాన్యైః పటహై రేకపుష్కరైః 6

భేరీ మురజ సన్నా దైరాడం బరకడిండిమైః
మర్దళై ర్వేణు వీణాభిర్వి విధైస్తాలనిస్వనైః 7

దర్దురైస్తాల ఘాతైశ్చ కచ్ఛపైః పణవైరపి
వాద్యమానైర్మహా యోగా అజగ్మర్దేవ సంసదమ్ 8

తా : రుద్రుడు స్మరించినంతనే గణేశ్వరులందరు సహస్ర హస్తములు. సహస్ర ఆయుధములు, త్రినేత్రములుగల మహాత్ము లందరు వచ్చిరి. వారిని దేవతలు కొల్చుచుండిరి. అందరు కోటి కాలాగ్ని సదృశులు, జటాధారులు, కోరలతో భయంకరాకారులు, నిత్యబుద్ధులు, నిర్మలులు కోటికోటి గణములతో సమానులైన గణేశ్వరులు అనేకులు సంతోషముగా వచ్చిరి. పాటలు పాడుచు, పరుగులుతీయుచు, వాద్యములువాయించుచు రథములు,ఏనుగులు గుర్రములు, సింహములు మర్కటములు వాహనములుగా గలిగి వచ్చిరి. కొందరు విమానములపైనను వచ్చుచు భేరీ మృందగ పణ

వానక గోముఖాది వాద్య విశేషములతోను మద్దెలలు, వీణలు, తాళములు, చప్పటలు వాయించుచు దేవసభకు విచ్చేసిరి.

శ్లో॥ తే గణేశా మహాసత్వా సర్వ దేవేశ్వరేశ్వరాః
ప్రణమ్య దేవం దేవీం చఇదం వచన మబ్రువన్ 9

తా : మహా బలవంతులగు గణాధిపతులందరు పార్వతీ పరమేశ్వరులకు నమస్కరించి ఇట్లనిరి.

శ్లో॥ భగవన్దేవ దేవేశ త్ర్యంబక వృషధ్వజ
కిమర్థంచ స్మృతాదేవ అజ్ఞాపయ మహాద్యుతే 10

కింసాగరాం చ్ఛోషయా మోయమం వాసహా కింకరై
హన్మేమృత్యుసుతాం మృత్యుం పశువద్ధన్మ పద్మజమ్ 11

బద్ధ్వేంద్రం సహదేవైశ్చ సహ విష్ణుంచ వాయునా
ఆనయామః సుసంకృద్ధాః దైత్యాన్వా సహదానవైః 12

కస్యాద్య వ్యసనం ఘోరం కరిష్యా మస్త వాజ్ఞయా
కస్యవాద్యోత్సవో దేవ సర్వకామ సమృద్ధయే 13

తా : భగవన్, దేవదేవ శంకర, మమ్ము స్మరించుటకు కారణమును తెల్పుడు, సముద్రములను శోషింపజేయవలెనో, యముని కింకరులతోసహా చంపవలెనో, మృత్యువును, జరను పశువుల వలె చంపవలెనో, బ్రహ్మను, దేవతలతో ఇంద్రుని, విష్ణువును, వాయువుతో సహా దైత్య దానవులను బంధించి తీసుకు

రావలెనో, ఎవరికి ఘోరబాధలు కల్పింపవలెనో లేక ఎవరికి సర్వ సమృద్ధి కరమగు ఉత్సవము చేయవలెనో ఆజ్ఞాపింపుము అనిరి.

శ్లో॥ తాంస్తదా వాదినః సర్వాన్ గణేశాన్ సర్వసమ్మతాన్
ఉవాచ దేవః సంపూజ్య కోటికోటి శతాన్ప్రభుః 14

శ్రుణుధ్వం యత్కృతే యూయమిహహూతాః జగద్ధితాః
శ్రుత్వాచ ప్రయతాత్మానః కురుధ్వం తద శంకితాః 15

నందీశ్వరోయం పుత్రోనః సర్వేషామీశ్వరేశ్వరః
విప్రోయం నాయకశ్చైవ సేనానీవః సమృద్ధిమాన్ 16

తమిమం మమ సందేశా ద్యూయం సర్వేపి సంమతాః
సేనాన్య మభిషించధ్వం మహాయోగ పతిం పతిం 17

ఏవముక్తా భగవతా గణపాః సర్వఏవతే
ఏవమస్త్వితి సంమంత్ర్య సంభారానా హరంస్తతః 18

తా : ఆ గణేశుల నందరితో శంకరుడు గౌరవ పురస్కరముగ నిట్లనెను. జగద్ధితవు కోరిన మీరందరు ఎందులకు పిలువబడిరో విని మీ కర్తవ్యమును నిర్వహింపుడు. ఈ నందీశ్వరుడు మా కుమారుడు. సర్వులకు ప్రభువు. అట్టి అతనిని మీ అందరి సమ్మతితో సేనానిగా అభిషిక్తుని చేయుడు. అని భగవానుడనగా గణాధిపతులందరు అట్లే అగుగాక యని సర్వులు ఆలోచించి సంభారములను సమకూర్చిరి.

శ్లో॥ తస్య సర్వాశ్రయం దివ్యం జాంబూ నదమయం శుభం
ఆసనం మేరు సకాశం మనోహర ముపాహరన్ 19

నైకస్తంభమయం చాపి చామీకర పర ప్రభమ్
ముక్తాదామా వలంబంచ మణిరత్నావ భాసితమ్ 20

స్తంభైశ్చ వైడూర్యమయైః కింకిణే జాలసంవృతం
చారు రత్నక సంయుక్తం మండపం విశ్వతో ముఖం 21

కృత్వా విన్యస్య తన్మధ్యే తదాస నవరం శుభం
తస్యాగ్రత పాదపీఠం నీలవజ్రా వభాసితమ్ 22

చక్రుఃపాద ప్రతిష్ఠార్థం కలశే బాస్య పార్శ్వగౌ
సంపూర్ణౌ పరమాం భోభిః అరవిందా వృతాననే 23

కలశానాం సహస్రంతు సౌవర్ణం రాజతం తథా
తామ్రజం మృణ్మయం చైవ సర్వతీర్థాంబు పూరితం 24

వాసోయుగం తథా దివ్యం గంధం దివ్యం తథైవచ
కేయూరే కుండలేచైవ ముకుటం హారమేవచ 25

ఛత్రం శతళలా కంచ వాలవ్య జనమేవచ
దత్తం మహాత్మనా తేన బ్రహ్మణా పరమేష్టినా 26

శంఖ హరాంగ గౌరేణ పృష్ఠేనాపి విరాజితం
వ్యజనం చంద్రశుభ్రంచ హేమదండం సుచామరమ్ 27

ఐరావతం సుప్రతీకో గజావేతౌసు పూజితౌ
ముకుటం కాంచనం చైవ నిర్మితం విశ్వకర్మణా 28

కుండలే చామరే దివ్యే వజ్రంచైవ వరాయుధం
బాంబూనదమయం సూత్రం కేయూర ద్వయమేవచ 29

సంభారాణితథాన్యాని వివిధాని బహూన్యపి
సమంతాన్నిన్యు రవ్యగ్రాగణా పాదేవ సమ్మతాః 30

తా : సర్వాలంకార యుక్తమయిన బంగారు ఉన్నతమయిన ఆసనమును సమకూర్చిరి. అనేక స్తంభములతోను, ముత్యాల హారములతోను, వైడూర్య స్తంభములతోను, చిరుగంటలతోను చతుర్ద్వారములు గల మంటపమును కూర్చి దానిమధ్య ఆసనమును నిల్పిరి. దానియందు నీలవజ్రములతో ప్రకాశించు పాదపీఠమును నిల్పిరి. దాని కిరుప్రక్కలను పవిత్ర జలములతో నిండిన రెండు కలశములు, బంగారు, వెండి మున్నగు లోహములతో గూడిన సహస్రకలశములు. వస్త్రయుగ్మము, కేయూరకుండలములు, కిరీటహారములు, ఛత్రచామరములు, స్వర్ణాలంకృతిమయిన శంఖము మున్నగు దివ్య లాంఛనములు కూర్చిరి. బంగారు కిరీటము, దివ్య కుండలములు స్వర్ణ యజ్ఞోపవీతము, ఐరావతము, సుప్రతీకము అను గజరాజములు, భుజకీర్తులు మున్నగు సంభారములన్నిటిని గణాధిపతులు సమకూర్చిరి.

శ్లో॥ తతోదేవాశ్చ సేంద్రాశ్చ నారాయణ ముఖాస్తథా
మునయో భగవాన్బ్రహ్మ నవబ్రహ్మాణ ఏవచ 31

దేవైశ్చ లోకాః సర్వేతేతతో జగ్ముర్ముదాయుతాః

తా : తరువాత ఇంద్రాది దేవతలు, నారాయణుడు,మునులు బ్రహ్మ, మరీచి, దక్ష వసిష్ఠాది నవబ్రహ్మలు మున్నగు దివ్య మూర్తులందరు సంతోషముతో చేరిరి.

శ్లో॥ తేష్వాగతేషు సర్వేషు భగవాన్పరమేశ్వరః 32
సర్వకార్యవిధం కర్తుమాదిదేశ పితామహమ్
పితామహోపి భగవాన్ నియోగా దేవతస్యతు 33
చకారసర్వం భగవానభిషేకం సమాహితః
అర్చయిత్వాతతో బ్రహ్మ స్వయమేవాభ్యషేచయత్ 34
తతో విష్ణు స్తతశ్చక్రో లోకపాలాస్త థైవచ
అభ్యషించంత విధి వద్గణేంద్రం శివశాసనాత్ 35

తా : ఇట్లు దేవతలందరు చేరగా పరమేశ్వరుడు సర్వ కార్యములను విధిప్రకారము నిర్వహింపమని బ్రహ్మకాజ్ఞాపించెను. బ్రహ్మ శివాజ్ఞచే అభిషేకము చేసెను. అట్లే విష్ణువు, ఇంద్రుడు, లోకపాలకులు గణాధిపతిగా నందిని అభిషేకించిరి.

శ్లో॥ ఋషయస్తుష్టు వుశ్చైవ పితామహ పురోగమాః
స్తుత వత్సుత తస్తేషు విష్ణుః సర్వ జగత్పతిః 36
శిరస్యంజలి మాదాయ తుష్టావచ సమాహితః
ప్రాంజలిః ప్రణతో భూత్వాజ యశబ్దం చకారచ 73

తతో గణాధిపా స్సర్వే తతో దేవాః తతోఽ సురాః
ఏవం స్తుతశ్చాభిషిక్తో దేవైః సబ్రహ్మకైస్తదా 38

తా : పితామహునితో కూడి ఋషులందరు స్తుతింపగా సర్వజగత్పతియగు విష్ణువు శిరసా అంజలిఘటించి స్తోత్రము చేసెను. వినయముతో నమ్రుడై నమస్కరించి "జయ" శబ్దము చేసెను. ఇట్లు దేవాసురులు, బ్రహ్మదులు స్తుతింపగా నందివక్త్రాభిషిక్తుడయ్యెను.

శ్లో॥ ఉద్వాహశ్చ కృతస్తత్ర నియోగాత్ పరమేష్ఠినః
మరుతాం చసుతాదేవీసుయ శాఖ్యాబ భూపయా 39

తా : పరమేష్ఠియొక్క అజ్ఞచే మరుద్దేవతల కుమార్తె "సుయశా" దేవితో వివాహముకూడ జరిగినది.

శ్లో॥ లబ్ధం శశిప్రభం ఛత్రం తయాతత్ర విభూషితం
చామరే చామరాసక్త హస్తాగ్రైః స్త్రీగణైర్యుతా 40

తా : చామర గ్రహిణులగు స్త్రీగణముల వలన పూర్ణ చంద్రునిబోలు ఛత్రము చామరతోలు లభించినవి.

శ్లో॥ సింహాసనంచ పరమంతయాచాధిష్ఠితం మయా
అలంకృతా మహాలక్ష్యా ముకుటాద్యైస్సు భూషణైః 41

తా : ఆ సుయశాదేవితో నేను మహాసింహాసనము నధిష్ఠించితిని. ఆమె మహాలక్ష్మిచే కిరీటాది సుభాషణములచే అలంకరింపబడినది.

శ్లో॥ లబ్ధోహారశ్చ పరమో దేవ్యాః కంఠ గతస్తదా
వృషేంద్రశ్చ సితోనాగః సింహః సింహధ్వజస్తదా 42
రథశ్చహే మఛత్రంచ చంద్రబింబ సమప్రభమ్
అద్యాపి సదృశః కశ్చిన్మయా నాస్తి విభుః క్వచిత్ 42
సాన్వయంచ గృహీత్వే శస్తథా సంబంధి బాంధవైః
ఆరుహ్య వృషమీశానోమయా దేవ్యాగతః శివః 44

తా : పార్వతి వలన కంఠహారము లభించినది. అట్లే వృషేంద్రము, శ్వేతగజము, సింహము, సింహధ్వజము, రథము. ఛత్రము, లభించినవి. ఇప్పటికిని నాతో సమానుడగు విభువు లేడు, అంత పరమేశ్వరుడు పార్వతితోను, నాతోను వృషభ వాహనుడయి, సంబంధి బాంధవులతో కలసి వెడలెను.

శ్లో॥ తదా దేవీం భవం దృష్ట్వా యయాచ ప్రార్థయన్ గణైః
ముని దేవర్షయః సిద్ధా ఆజ్ఞాం పాశుపతీం ద్విజా 45
అథాజ్ఞాం ప్రదదౌతేషా మర్హాణా యాజ్ఞాయా విభోః
నందికోన గణాభర్తుః తేషాం పాశుపతీం శుభాం 46
తస్మాద్ధి మునయో లబ్ధ్వా తదాజ్ఞాం ముని పుంగవాత్
భవభక్తా స్తదావాసం స్తస్మాద్దేవం సమర్చయేత్ 47

తా : అట్లు శంకరుడు వెడలు సమయమున పార్వతీ పరమేశ్వరులను నేను దేవర్షులు, సిద్ధులు శలపు వేడితిమి. పశుపతి

ఆజ్ఞ చేసెను. పార్వతీ పరమేశ్వరులకు అర్హులగు దేవఋషులకును "నందికః" అనగా ఆనందకరుడనైతిని. కావున మునిపుంగవుడైన నందికేశ్వరుని ఆజ్ఞ ప్రకారము మునులు నా శివారాధన మహిమను చూచినది మొదలు శివభక్తులు శివైక సేవకులు కాగలిగిరి, కావున భక్త్యైశ్వర్య ప్రవర్ధకమగుటచె శివ సమర్చన, శివపూజ చేయ వలెను. అని తాత్పర్యము.

శ్లో॥ నమస్కార విహీనస్తు నామ ఉద్గీరయేచ్ఛవే
బ్రహ్మఘ్న దశసంతుల్యం తస్యపాపం గరీయసమ్ 48

తస్మాత్సర్వ ప్రకారేణ నమస్కారాపి ముచ్చరేత్
అదౌ కుర్యా న్నమస్కారం తదంతే శివతాం వ్రజేత్ 49

ఇతి లింగమహాపురాణే పూర్వభాగే నందికేశ్వరాభిషేకో నామ చతుశ్చత్వారింశోధ్యాయః 44

తా॥ నమస్కార విహీనుడై లౌకిక నామమును పలుకు వాని పాపము పది బ్రహ్మహత్యలు చేసిన వాని పాపముతో సమా నము. కావున నమస్కారము ముందు చేయవలెను. ముందు నమ స్కారమును ఎవరు చేయుదురో వారు తుదకు శివత్వము అనగా కళ్యాణ రూపత్వమును పొందుదురు.

44వ అధ్యాయములోని ప్రార్థన

శ్లో॥ సువర్ణ రతాసన సన్నివిష్టం
దేవై ర్మునీంద్రై రభిషిచ్యమానం

పత్న్యాయుతంవిష్ణు ముఖాత్పరైః స్తుతం
శివప్రియం నందినమాశ్రయే సదా.

తా : సువర్ణ రత్నాసనాసీనుడై దేవతలచేత, మునీంద్రుల
చేత అభిషేకము చేయబడినవాడై విష్ణువు మున్నగు వారిచే
స్తుతింపబడి శివప్రియుడై భార్యయగు సుయశాదేవితో గూడిన
"నంది"కేశ్వరుని సదా ఆశ్రయింతును.

* * * * *

# శివ మహాపురాణము
# చతుర్థ రుద్రకోటి సంహిత

## 5 వ అధ్యాయము

ప్రధాన శివలింగ వర్ణన చేయుచు–

శ్లో॥ తతశ్చ నందికోదేవః హత్యాకోటి నివారకః 9

తా : అనంతరము నందిక దేవుడు కోటి హత్యల వలన
కలిగిన పాపమును గూడ పోగొట్టును.

శ్లో॥ సర్వ కామార్థ దశ్చైవ మోక్షదోహి ప్రకీర్తితః 11
నందికేశంచ యశ్చైయ పూజయేత్ పరయాముదా
నిత్యంత స్యాఖిలా సిద్ధిర్భవిష్యతి న సంశయః 12

తా : సర్వ కామార్థములను మోక్షమును ఇచ్చునది. నవ కేశుని పూజించువారికి సకలార్థసిద్ధి కల్గునని యున్నది.

శౌనకాది ఋషులు సూతుని నందికేశ మహత్మ్యమును చెప్పుమనగా నాతడిట్లు చెప్పెను.

పూర్వము కర్ణికాపురమున బ్రాహ్మణుడొకడు భార్యను తన ఇద్దరు పుత్రులకు అప్పగించి కాశీయాత్రకు వెళ్ళి అచ్చట మరణించెను. ఆ విప్రపత్ని కుమారులకు ధనమునిచ్చి తాను పుణ్య కార్యములు చేయుచు మరణకాలము రాగా మరణయాతన పడ సాగెను. ఆమె మరణబాధను చూచి జ్యేష్టుడు ఆమె కేదైనను కోరికలు కలవేమోనని అడుగగా ఆమె "నాయనా నాకు కాశీయాత్ర చేయవలెనని కోరిక గలదు కాని ఇప్పుడు మరణకాల మాసన్న మయినది. నేను మరణించిన తరువాత నా అస్థులను గంగాజల ములో వైచితివేని నీకు శుభము కలుగు"ననెను. అంత జ్యేష్టుడు అమ్మా! తప్పక నీ కోరిక నెరవేర్చెదను. నీ కోరిక ప్రకారము చేసిన తరువాతనే నేను నా పనులు చూచుకొందును. అని జలదాన పూర్వకముగ వాగ్దానము చేయగా నామె హరస్మరణము చేయుచు ప్రాణములు విడిచెను, ఆమె పెద్దకుమారుడు సువాదుడనువాడు ఆమెకు సంస్కారాదులు చేసి మానసికకర్మ అయిన తరువాతభార్యా పుత్రులను ఇంటనుంచి ఒక సేవకునిచే కాశీకి బయలుదేరెను. మొదటి దినమున ఒక యోజనమున పయనించి రాత్రి యొక

బ్రాహ్మణ గృహమున బసచేసెను. ఆ రాత్రి రెండు ముహుర్త ములు అనంతరము ఆ గృహస్వామి ఇంటికివచ్చి ఆవును పాలు పితుకుటకు దూడను వదలి తొందరలో దూడను కట్టబోగా అది బ్రాహ్మణుని కాలు త్రొక్కెను. ఆ బాధకు కోపోద్రిక్తుడై బ్రాహ్మ ణుడు దూడను గట్టిగా కొట్టి బాధపెట్టెను. పాలు పితికిన తరువాత దూడను వదలగా దెబ్బలుతిన్న దూడనుచూచి ఆవు విలపింప సాగెను. తల్లి విలాపమునకు దూడ కారణమడుగగా దుష్టుడైన బ్రాహ్మణుడు దూడను కొట్టుటచే బాధ కల్గినదని ఆవు చెప్పెను. ఆవు పడుచున్న బాధకు దూడ వివేకముతో అమ్మా! విచారింప కుము. మనము కర్మబద్ధులము. మనము చేసిన కర్మఫలమునే అనుభవింప వలయును. నవ్వుతూ కర్మచేసి ఏడ్చుచు ఫలమనుభ వింతురు. మనమందరము కర్మబద్ధుల మగుటచే విచారింప తగదని బోధించెను. దూడ హితబోధకు ఆవు మనము కర్మాధీనులమని తెలిసినను నాకు దుఃఖమాగలేదు. ఇది మాయాబలమని చెప్పగా దూడ తల్లితో విచారించి లాభములేదు. ధైర్యముగా నుండుమని బోధించినది. అయినను నాకు గల్గిన దుఃఖము బ్రాహ్మణునికి గల్గిన యెడల నాకు శాంతి కల్గునని చెప్పినది. అదియును గాక మరునాడు ఉదయము బ్రాహ్మణుని కొమ్ములతో పొడిచి చంపెద నని కూడ చెప్పినది. అందుకు దూడ వివేకముతో పాపఫలము అనుభవము చేతనే నశించును కాని మరొక పాపకార్యము వలన ప్రయోజనమేమని బోధించినది. అందులకు ఆవు ఆ విషయము

నాకు తెలుసుసుగాని మాయావశమున దుఃఖమును వీడలేకుంటిని దీనివల్ల బ్రహ్మహత్యాదోషము వచ్చినను నాకుసమ్మతమే. ముందు బ్రాహ్మణవధచే నాకు గల్గిన దుఃఖము పోవును. తరువాత గల్గిన బ్రహ్మహత్యాదోషము' పోవుటకు మార్గమున్నదని చెప్పగా దూడ మౌనముగా నుండెను. ఈ ఆవు–దూడల సంభాషణను విన్న బాట సారి ఆశ్చర్యముతో బ్రహ్మహత్యాదోషము పోవుటకు ఆవు వెళ్ళు స్థలమును చూడవలెనని నిశ్చయించుకొనెను. మరునాడు ఉదయము ననే ఇంటియజమాని బాటసారి యొద్దకు వచ్చి తెల్లవారినది. నీ యాత్ర సాగింపుమని చెప్పగా అయ్యా! నా సేవకునికి ఆరోగ్యము సరిగా లేదు. కొంచెము విశ్రమించి ప్రయాణింతుము అనిచెప్పెను. ఈ మిషతో బాటసారి మరల పరుండెను. ఉదయము పాలు పితుకు సమయమునకు ఇంటియజమాని పనిమీద బయటకు వెళ్ళుచూ కుమారుని పిలచి తాను బయటకు పోవుచుంటిననియు, ఆవుపాలు పుత్రుని పిదుకమనియు చెప్పి వెడలిపోయెను. బ్రాహ్మణ కుమారుడు లేచి పాలు పితుకుటకై దూడను విడచెను. బాలుడు దెబ్బలతో బాధపడుచున్నదూడను తల్లి సమీపములో బంధించి పాలుపితుకు తొందరలో నుండగా ఆవు కోపముతో ఆ బ్రాహ్మణబాలుని కొమ్ము లతో పొడిచెను. బాలుడు మర్మస్థలములో దెబ్బ తగులుటచే క్రింద పడి మూర్ఛనొందెను. ఇరుగు పొరుగువారు బాలుడు ప్రమాదము లో నున్నాడు జలము తెండు అనుటలో బాలుడు మృతి నొందెను.

బాలునితల్లి విలపించుచు ఆవును గట్టిగాకొట్టి విడచెను ఆ దెబ్బ లకు తెల్లని ఆవుశరీరము నల్లబడినది. ప్రజలు కేకలు వేయు చుండగా బాటసారి బ్రాహ్మణుడు లేచి యీ విషయము చూచి ఆవును వెంబడించెను. ఆవు తిన్నగా నందికేశ్వర తీర్థమునకు వచ్చి మూడుసార్లు కృంకు విడువగా పూర్వమువలె నలుపుపోయి శ్వేత త్వము వచ్చినది. బాటసారి బ్రాహ్మణు డిదియంతయు చూచి అహెూ! ఈ తీర్థమెంత ధన్యతమయినది. ఇది బ్రాహ్మహత్యా నివారకము అని పొగడెను. అట్లు పొగడుచు బ్రాహ్మణుడు, సేవ కుడు కూడ ఆ ప్రవాహమందు మునిగి దాని మహిమను ప్రశం సించుచు బయలు వెడలిరి. ఇంతలో మార్గమధ్యమున భూషణా న్వితమై యొక సుందరి కనిపించి ఓ పాంధుడా! ఎచ్చటకు వెళ్ళు చుంటివి? యదార్థము చెప్పుమనగా నా బ్రహ్మణుడు నిజమును చెప్పెను. అంత నామె నీ ఇంతకుముందు చూచిన స్థలము చాలా గొప్పది. ఇందు నీ తల్లి అస్తికలను విడువుము, కాశీ గంగాయే ఈ జలములకు తన పాపములు పోగొట్టుటకు వచ్చును. ఇందు నీ తల్లి అస్తికలు వైచితివేని ఆమె సాక్షాత్ శంకరునే చేరును. అని చెప్పగా బ్రాహ్మణుడట్లు చేసెను. ఎముకలు తీర్థములో వేయగానే అతని తల్లి దివ్యదేహములతో సాక్షాత్కరించినది నీవు ధన్యుడువు, కృతకృత్యుడవు, నీ వలన నీకులము పవిత్రమైనది, ధన ధాన్యా దులు దీర్ఘాయువులతో నీ వంశము వర్ధిల్లుగాక యని ఆశీర్వదించి

స్వర్గమునకేగెను. అచ్చట చిరకాలము స్వర్గ సుఖముల ననుభవించి శంకరానుగ్రహమున ఉత్తమగతినొందెను. బ్రాహ్మణ తనయుడును సంతోషముతో శుద్ధుడై ఇంటికి చేరెను.

ఇట్లు నందికేశ్వర వరనం, బ్రాహ్మణీ స్వర్గతి వర్ణనము అను ఆరవ అధ్యాయము.

* * * * *

## ఏ డ వ అ ధ్యా య ము

శ్లో॥ నంది కేశః శివః ఖ్యాతాః సర్వపాప వినాశనః
గంగాపి ప్రతివర్షంతు తత్రయాతి శుభేచ్ఛయా
తస్మిన్లింగేలయం యాతః పూర్ణాసేనతయా హరః 31
తత్రస్నాతో నరః సమ్యక్ నందికేశం సమర్చ్యేచ
బ్రహ్మ హత్యాద్భిః పాపైః ముచ్యతే హ్యఖిలైరసి 35

తా : అచ్చటి లింగమునకు సర్వపాప వినాశకుడగు నంది కేశుడను శివుడుగా ఖ్యాతిగాంచెను. గంగాదేవియు ప్రతి సంవత్సరము శుభేచ్ఛతో అచ్చటికి వచ్చును. ఆ లింగమునందు శంకరుడు పూర్ణాంశతో లయమొందెను. అచ్చట స్నానము చేసి నందికేశు నర్చించిన వారికి బ్రహ్మహత్యాది సర్వపాపములు నశించును.

* * * * *

# మహానంది - బ్రహ్మహత్యా దోషహారవుి

శివమహాపురాణము - చతుర్థ రుద్రకోటి సంహిత

## 5 వ అధ్యాయము

ప్రధాన శివలింగ వర్ణనము :

శ్లో॥ తతశ్చ నందికో దేవో హత్యాకోటి నివారకః
సర్వ కామార్థదశ్చైవ మోక్షదో హి ప్రకీర్తితః 11

తా : అనంతరము నందికేశ్వర దేవుడు కోటి హత్యల వలన కలిగిన పాపమును పోగొట్టును. సర్వకామములను నెరవేర్చువాడు మోక్షము నిచ్చువాడుగను చెప్పబడెను.

శ్లో॥ నందికేశంచ యశ్చైవ పూజయేత్ పరయాముదా
నిత్యంతస్యాఖిలా సిద్ధిర్భవిష్యతి న సంశయః 12

తత్రతీరేచయస్నాతి వాహిన్యాం ముని సత్తమాం
తస్య కామాశ్చ సిధ్యంతి సర్వం పాపం వినశ్యతి 13

తా : నందికేశుని ముదముతో నెవ్వడు పూజించునో అట్టి వానికి నిత్యము సర్వసిద్ధులు కలుగును. సంశయము లేదు, ముని సత్తములారా ఆ ప్రవాహ తీర్థమున నెవ్వడు స్నానము చేయునో అట్టివాని కోరికలన్నియు సిద్ధించును. పాపములన్నియు నశించును. అని సూతుడు చెప్పగా ఋషులిట్లనిరి.

శ్లో॥ ఏవంతస్యచ మహాత్మ్యం కథంతత్ర మహామునే
నందికేశస్య కృపయా కథ్యతాం చత్వ యాధునా 14

తా : ఓ మహా బుద్ధిమంతుడవైన సూతా! ఆ తీర్థమున కట్టి మహాత్మ్యము ఎట్లు కల్గినదో నందికేశ్వరుని దయవలన మాకు చెప్పవలసినది.

సూతుడిట్లనెను :

శ్లో॥ సమ్యక్ పృష్టంభవద్భిశ్చ కధయామి యధాశ్రుతం
శౌనకాద్యాశ్చమునయః సర్వేహి శ్రుణుతా దరాత్ 51

తా : శౌనకాది మునులారా! మంచిప్రశ్న అడిగితిరి. నేను విన్న విషయమంతయు చెప్పెదను మీరందరు ఆదరముతో వినుడు.

శ్లో॥ పురాయుధిష్ఠిరేణైవం పృష్టశ్చ ఋషిసత్తమః
యధో వాచ తధావచ్మి భవత్స్నేహాను సారతః 16

తా : పూర్వము యుధిష్ఠిరునిచే ఇట్లడుగబడినవాడై ఋషి సత్తముడు ఎట్లు చెప్పెనో అట్లే మీ యందరి స్నేహాతిశయముతో చెప్పుచున్నాను వినుడు.

శ్లో॥ రేవాయాః పశ్చిమేతీరే కర్ణికీ నామవైపురీ
విరాజతే శుశోభాఢ్యా చతుర్వర్ణ నమాకులా 17

తత్ర ద్విజవరః కశ్చి దుత్తస్య కులసంభవః
కాశ్యా గతస్య పుత్రాభ్యా మర్పయిత్వా స్వపత్నికాం 18

తత్రైవస మృతో విప్రః పుత్రాభ్యాంచ శ్రుతం తదా
తదీయం చైవ తత్కృత్యం చక్రాతే పుత్రకావుభౌ 19

తా : రేవా పశ్చిమ తీరమున కర్ణకి యను పురము గలదు. అయ్యది చతుర్వర్ణముల వారిచె సంపన్నమై మహాశోభతో విరాజిల్లు చున్నది,

ఆ పురమునందు ఉత్తుడను వాని కులమందు పుట్టిన బ్రహ్మణ శ్రేష్ఠుడొకడుండెను. అతడు తన ఇద్దరు కుమారులకు తన భార్యను సంరక్షణకై నియమించి కాశీపట్టణమున కేగెను. ఆ విప్రుడు కాశీ నగరమునందే మరణించగా కుమారులా సంగతి విని తండ్రికి పార లౌకిక క్రియల నాచరించిరి.

శ్లో॥ పత్నీచ పాలయామాస పుత్రౌచ పుత్రహితైషిణీ
పుత్రౌచ వర్జయిత్వా చవిభక్తం వైధనంతయా 20
స్వీయంచ రక్షితం కించద్ధనం మరణ హేతవే
తతశ్చ ద్విజపత్నీ హికి యత్కాలం మృతాచసా 21
కదాచిత్క్రియమాణాసా వివిధం పుణ్యమాచరత్
నమృతా దైవ యోగేన ద్విజపత్నీచ సాద్విజాః 22
యదాప్రాణాన్నముముచే మాతా దైవాత్త యోశ్చసా
తద్దృష్ట్వా జననీ కష్టం పుత్ర కావూ చతుస్తదా 23

తా : ఆ బ్రాహ్మణభార్య పుత్రులను ప్రీతితో రక్షించెను. ఆమె తన రక్షణకుగాను కొంచెము ధనమునుస్వీకరించి పుత్రులకు మిలిగినదంతయు విభజించి ఇచ్చినది. ఆమె మరణమును నిరీక్షిం చుచు వివిధ పుణ్యకార్యము లాచరించినది.

దైవయోగముచే నామె మరణభాధ పడుచు ప్రాణములు విడువలేక పోయెను. తల్లియొక్క మరణభాధను చూచి పుత్రులిట్లనిరి.

శ్లో॥ కిం న్యూనం విద్యతేమాతః కష్టం యద్విద్యతే మహత్
ప్రియతాంతద్వ్రతం ప్రీత్యా తదావాం కరవావహే 24

తా : అమ్మా, చాలా కష్టపడుచుంటివి. నీ మనసులో కోరిక ఏదైన వున్నచో కోరుకొనుము. మేము సంతోషముతో నెరవేర్చగలము

సూతుడిట్లు చెప్పెను :

శ్లో॥ తచ్ఛ్రుత్వోక్తం తయాతత్రన్యూనంమే విద్యతే బహు
తదేవ క్రియతే చేద్వైసుఖేన మరణం భవేత్ 25

శ్లో॥ జ్యేష్ట పుత్రశ్చ యస్త స్యాస్తేనోక్తం కథ్యతాంత్వయా
కరిష్యామి తదేతద్ధితయాచ కథితం తదా

తా : పుత్రులమాట విని నాయనా! నాకు లోటు చాలా గలదు. మీరు చేయదలచినయెడల నేను సుఖముగా మరణించ గలను. అనగా పెద్దకుమారుడు నీ కోరిక చెప్పవలసినది. తప్పక చేయగలను అని యనగా నామె ఇట్లు చెప్పదొడగెను.

ద్విజపత్ని ఇట్లు చెప్పెను :

శ్లో॥ శృణుపుత్ర వచః ప్రీత్యా పురాసీన్మే మనఃస్పృహా
కాశ్యాంగంతుం తథానా సీదిదానీం మ్రియతే పునః 27

మమాస్తీని త్వయాపుత్ర క్షేపణీ యాన్యతం ద్రితం
గంగాజలే శుభంతేద్య భవిష్యతి న సంశయః 28

తా : నాయనా శ్రద్ధతో వినుము. పూర్వము నాకు కాశీ యాత్ర చేయవలెనను కోరిక గలదు. కాని అది జరుగలేదు ఇప్పుడు మరణించుచుంటిని. నా అస్తికలను జాగ్రత్తగా గంగా జలములో విడిచిన నీకు శుభము కలుగును. సందేహము లేదు సూతుడిట్లు చెప్పెను.

శ్లో॥ ఇత్యుక్తే చతయా మాత్రాస జ్యేష్ఠతనయోఽ బ్రవీత్
మాతరం మాతృ భక్తస్తు సవ్రతాం మరణోన్ముఖీం 29

తా : ఇట్లు తల్లి చెప్పగా మాతృభక్తి పరాయణుడైన జ్యేష్ఠ పుత్రుడు మరణోన్ముఖురాలగు తల్లితో నిట్లనెను.

శ్లో॥ మాతస్తయా సుఖైనైవ ప్రాణాస్త్యాజ్యా న సంశయః
తవకార్యం పురాకృతా పశ్చాత్కార్యం మదీయకం 30
ఇతి హస్తే జలందత్వా యావత్పుత్రో గృహంగతః
తావత్సా చమృతాతత్ర వారస్మరణ తత్పరం 31

తా : అమ్మా ! ముందు నీకోరిక చెల్లించి తరువాత నా పనులు చూచుకొందును. సందేహములేదు, సుఖముగా ప్రాణము

లను విడువుము. అని చెప్పి జలమును తల్లి చేతిలో వదలి కుమారుడు ఇంటికి వెళ్ళగానే తల్లి హరి స్మరణ చేయుచు ప్రాణములు విడచెను.

శ్లో॥ తప్యాశ్చైవతు యత్కృత్యం సంవిధాయ సరి 32
మాసికం కర్మకృత్వాతు గమనాయ ప్రచక్రమే

తా: ఆమె సాంప్రదాయక కృత్యములు యథా విధిగ నిర్వర్తించి, మాసిక కర్మాలాచరించి కాశీకి ప్రయాణమాయెను.

శ్లో॥ ద్వయోః శ్రేష్ఠ తమోయోవై సువాదో నామ విశ్రుతః 33
తదస్తీని సమాదాయ నిస్సృత స్తీర్థ కామ్యయా

తా : ఆ ఇద్దరిలో శ్రేష్టుడగు సువాదుడని ప్రసిద్ధి కెక్కినవాడు తల్లి అస్తికలను తీసుకొని తీర్థ యాత్రలకు బయలుదేరెను.

శ్లో॥ సంగృహ సేవకం కంచిత్తె నైవ సహిత స్తదా 34
ఆశ్వాస్య భార్య పుత్రాంశ్చ మాతుః ప్రియచి కీర్షయా

శ్లో॥ శ్రాద్ధదా నాదికం భోజ్యం కృత్వా విధి మనుత్తమం 35
మంగళ స్మరణం కృత్వా నిర్జగామ గృహాద్ద్విజరి

శ్లో॥ తద్ది నేయోజనం గత్వా వింశతి గ్రామకే శుభే 36
ఉవాసాస్తంగతే భానే గృహేవి ప్రస్యకస్యచిత్

శ్లో॥ చక్రే సంధ్యాది సత్కర్మ సద్విజో విధి పూర్వకం 37
స్తవాదికృత వాంస్తత్ర శంభో రద్భుత కర్మణః

తా : భార్య పుత్రులను ఒదార్చి తల్లికి మేలు చేయుటకు గాను ఇంటి సేవకు నొకనిని తన వెంట బయలు దేరదీసి, విధి యుక్తమగు శ్రీద్ధాదికములు, అన్న దానములు నిర్వర్తించి మంగళ స్మరణ చేసి ఆ బ్రాహ్మణుడు ఇంటి నుండి బయలుదేరెను. ఆ దినమున ఒక యోజన దూరము ఇరువది గ్రామములు దాటి సూర్యాస్తమయము కాగా నొక విప్ర గృహమందు బస చేసెను. ఆ బ్రాహ్మణుడు సంధ్యాది సత్కర్మలు నిర్వహించి ఆస్భృత కర్మ లాచరించు శంకరుని స్తోత్రములు చేసెను.

సేనకేన తదాయుక్తో బ్రాహ్మణః సంస్థిత స్తదా 38
యామినీ చగతా తత్రముహుర్తద్వయ సంమితా

ఏ తస్మిన్నంతరే తత్రైక మాశ్చర్యమ భూత్తదా 39
శ్రుణుతాదరతస్తచ్చమున యేవోవదా మ్యహం

తా : ఆ బ్రాహ్మణుడు సేవకునితో కలసి బస చేసి యుండగా ఆ రాత్రి రెండు ముహూర్తముల కాలము గడిచినది. ఇంతలో నొక ఆశ్చర్యకర సంఘటన జరిగినది. మునులారా మీకు చెప్పెదను ఆదరముతో వినుడు. అని సూతుడనెను. ఇతి శివ మహా పురాణే చతుర్థ్యాం కోటి రుద్ర సంహితాయాం నందికేశ్వ మహాత్మ్యే బ్రాహ్మణీ మరణ వర్ణనం నామ పంచ మోధ్యాయః ఇది బ్రాహణి మరణ వర్ణనము పంచమాధ్యాయము.

## ఆరవ అధ్యాయము

సూతుడిట్లు చెప్పెను :-

గౌశ్చైకాప్య భవత్తత్ర హ్యంగణే బంధితా శుభా
తత్రైవ బ్రాహ్మణో రాత్రావాజ గామ బహిర్గతః 1

స ఉవాచ ప్రియం స్వీయాం దృష్ట్వా గామంగణే స్థితాం
అదుగ్ధాం ఖేవ నిర్వణ్ణో దోగ్ధు కామో మునీశ్వరాః 2

గౌః ప్రియేనైవ దుగ్ధాతసే తుక్తా వత్స మానయత్
దోహనార్థం సమాహూయ స్త్రియం శీఘ్రతరం తదా 3

వత్సం కీలే స్వయం బద్ధుం యత్నం చైవాక రోత్తదా
బ్రాహ్మణ స్సగృహ స్వామీ మునయో దుగ్ధలాలసం 4

వత్సోపి కర్షమాణశ్చ పాదే వైపాద పీడనం
చకార బ్రాహ్మణశ్చైవ కష్టం ప్రాప్తశ్చ సువ్రతాః 5

తేన పాద ప్రహరేణ నద్విజః క్రోధ మూర్ఛితః
వత్సంచ తాడయామాస కూర్పైః దృఢత రాతదా 6

వత్సోపి పీడతస్తేన శ్రాంతశ్చైవా భవత్తదా
దుగ్ధా గౌర్మోచితో వత్సోన క్రోధేన ద్విజన్మనా 7

గౌర్దో గ్ధుంచ మహత్ప్రీత్యా రోదనం చాకరోత్తదా
దృష్ట్వాచ రోదనం తస్యా వత్సో వాక్యము థాబ్రవీత్ 8

తా : శుభ లక్షణములు గల ఒక గోవు ముంగిలి వాకిట యందు కట్టబడి యున్నది. అంతట బయటకేగిన బ్రహ్మణుడు రాత్రి ఇంటికివచ్చి వాకిట నున్న అవును చూచి పాలు పితుకనట్లు భార్యవలన తెలిసికొని పాలు పిదుక సమకట్టెను. త్వరితముగా పాలు పిదుకవలెనని దూడను కట్టు రాటకు కట్టుటకై ప్రయత్నించగా దూడ లాగబడగా బ్రాహ్మణుని కాలు త్రొక్కెను. ఆ బాధకు బ్రాహ్మణుకు క్రోధ మూర్ఛితుడై దూడను కట్టు కర్రతో ఘట్టిగా కొట్టెను. దూడ కూడ దెబ్బలకు తాళజాలక అలసిపోయెను పాలు పితికిన తరువాత బ్రాహ్మణుడు కోపముతో దూడను విడువ జాయెను. అవు తన దూడకు పాలు ఇవ్వలేక పోయినందుకు రోదింపసాగెను. తల్లి రోదనను విని దూడ ఆవుతో ఇట్లనెను.

దూడ ఇట్లనెను :

కథం చరుద్యతే మాతః కింతే దుఃఖము పస్థితమ్
తన్మి వేదయమే ప్రీత్యా తచ్ఛ్రుత్వా గౌరవోచత 9

శ్రూయతాం పుత్రమే దుఃఖం వక్తుం శక్నోమ్యహం నహి
దుష్టేన తాడి తస్త్వంచ తేన దుఃఖం మమాప్య భూత్ 10

తా : తల్లి నీ వెందులకు దుఃఖించుచుంటివి. నీ కెందులకు దుఃఖము వచ్చినది నాకు తెల్పుమనగా తల్లి నాయనా దుఃఖమును వర్ణింపలేను. ఆ దుర్మార్గుడు నిన్ను కొట్టుటచే నాకు కూడ దుఃఖము వచ్చినది.

స్వమాతుర్వచనం శ్రుత్వా సవత్సః ప్రత్యబోధయత్
ప్రత్యువాచ స్వజననీం ప్రారబ్ధ పరినిష్ఠితః 11

కిం కర్తవ్యం క్వగంతవ్యం కర్మ బద్ధావయం యతః
కృతం చైవ యథాపూర్వం భుజ్యతే చత థాధునా 12

హసతా క్రియతే కర్మరు దతా వరిభుజ్యతే
దుఃఖ దాతాన కోప్యస్తి సుఖదాతాన కశ్చన 13

సుఖ దుఃఖే పరోదత్త ఇత్యేషా కుమ తిర్మతా
అహం దాపి కరోమ్యత్ర మిథ్యాజ్ఞానం తదోచ్యతే 14

స్వకర్మణా భవే ద్దుఖం సుఖం తేనైవ కర్మణా
తస్మాచ్చ పూజ్యతే కర్మ సర్వం కర్మణీ సంస్థితం 15

తంచై వాహంచ జనని ఇమేజీ వాదయశ్చయె
తేసర్వే కర్మణా బద్ధాన శోచ్యాః కర్హి చిత్త్వయా 16

తా : తన తల్లి మాట విని ప్రారబ్ధాను భవము తప్పదను నిశ్చయ జ్ఞానముతో తల్లికి హితోపదేశము చేసెను. అమ్మా మన మేమి చేయవలెను, ఎక్కడకు పోవలెను మనము కర్మబద్ధులము పూర్వము చేసినట్లే నేడు అనుభవింప వలెను. నవ్వుచూ చేయుచూ దుఖించుచూ అనుభవింప బడును దుఃఖదాత కాని సుఖదాత కాని ఎవ్వరును లేరు. సుఖ దుఃఖములు పరులచే కలుగు ననుకొనుట మంచిబుద్ధి కాదు. నేనుకూడా మిథ్యాజ్ఞానముతో పనులు చేయుచు చెప్పుచున్నాను, సుఖదుఃఖములు స్వకర్మల వల్లనే కల్గుచుండుచు.

కావున కర్మనే పూజింపవలెను. కర్మయందే అన్నియు గలవు. అమ్మా నేనూ, నీవూ, ఈ జీవులన్నియు కర్మచేతనే బంధింప బడినవి. కావున విచారింప కూడదు.

ఏవం శ్రుత్వా స్వపుత్రస్య వచనం జ్ఞాన గర్భితమ్
పుత్ర శోకాన్వితా దీనా సాచ గౌరబ్ర వీదిదమ్ 17

తా : ఇట్లు జ్ఞాన గర్భితమైన పుత్రుని మాటలు విని గోవు కూడ పుత్ర శోకముతో నిట్లనెను.

గోవు చెప్పుచున్నది

వత్స సర్వం వి జానామి కర్మాధేనా ప్రజా ఇతీ
తథాపి మాయ యాగ్రస్తా దుఃఖం ప్రాప్నో మ్యహం
పునః 18

రోదనంచ కృతం భూరి దుఃఖ శాంతిర్నవే న్నహి
ఇత్యేత ద్వచనం శ్రుత్వా ప్రసూంవత్సో బ్రవీదిదమ్ 19

తా: నాయనా జీవులందరు కర్మాధేనులను విషయమంతయు నే నెరుగుదును. అయినను మాయలో బడి మరల దుఃఖించుచు ఎంత ఏడ్చినను దుఃఖ శాంతి కలుగలేదు. తల్లి మాటలు విని తనయుడిట్లనెను.

వత్స పలెకెను :

యద్మేపంచ విజ్ఞానాసి పునశ్చ రుదనం కుతః
కృత్వాచ సాధ్యతే కిం చిత్త స్మా ద్దుఃఖంత్య జాధునా 20

తా : అట్లు తెలిసియు మరల దుఃఖించుట ఎందులకు దుఃఖించి ఏమి సాధింపగలము. కావున దుఃఖము విడువుము.

సూ తు డి ట్ల నె ను :

ఏవం పుత్రవచః శ్రుత్వా తన్మాతా దుఃఖ సంయుతా
నిశ్వస్యాతి తదాధే నుర్వత్సం వచన మబ్రవీత్ 21

తా : ఇట్లన్న పుత్రవచనము విని, దుఃఖముతో నిట్టూర్చి గోవు దూడతో నిట్లనెను.

గోవు చెప్పుచున్నది :

మమ దుఃఖం తదా గచ్ఛే ద్యథా దుఃఖంతదావిధం
భవేద్ధి బ్రాహ్మణ స్యాపి సత్యమే తద్బ్రవీ మ్యహమ్ 22

తా : నాకు ఎట్టి దుఃఖము గల్గినదో అట్టి దుఃఖము ఆ బ్రాహ్మణునకు కూడ కల్గిన యడల నా దుఃఖము పోవును. ఇది సత్యము.

ప్రాతశ్చైవ మయాపుత్ర శృంగాభ్యాం హనిష్యతే
హతశ్చ జీవితం సద్యో యా స్యత్యద్యన సంశయః 23

తా : నాయనా ! ఉదయము బ్రాహ్మణ కుమారుని నా కొమ్ములతో చంపగలను. అట్లు చనిపోయినవాడు వెంటనే బ్రతుక గలడు సందేహము లేదు.

వత్స ఇట్లనెను :

ప్రథమం యత్కృతం కర్మ తత్ఫలం భుజ్యతే ధునా
అస్యాశ్చ బ్రహ్మహత్యాతయాః మాతాః కింఫల మాస్యసే 24

సమాభ్యాం పుణ్య పాపాభ్యాం భవే జ్జన్మచ భారతే
తయోః క్షయేచ భోగేచ మాత ర్ముక్తి రవాప్యతే 25

కదాపి కర్మణో నాశః కదా భోగః ప్రజాయతే
తస్మాచ్చ పునరే వంత్వం కర్మయా కర్తు ముద్యతా 26

అహం కుతస్తే పుత్రోద్యత్వం మాతా కుత ఏవచ
వృథాభిమానః పుత్రత్వే మాతృత్వేచ విచార్యతామ్ 27

క్వమాతా క్వపితా విద్ధి క్వస్వామీ క్వకళ త్రకమ్
న కోపి కస్య చాస్తీహ సర్వేపి స్వకృతం భుజః 28

ఏవం జ్ఞాత్వాత్వయా మాతర్దుఃఖం త్యాజ్యం సుయత్నతః
సుభగా చరణం కార్యం పరలోక సుఖేప్సయా 29

తా : ముందు ఏ కర్మ చేయుబడునో దాని ఫలమే ఇప్పుడు అనుభవింపబడుచున్నది. అమ్మా ఈ బ్రహ్మహత్య వలన ఏమి ఫలము పొందగలవు. పుణ్యా పాపములు సమముగా నున్నవారే యీ భారతదేశమున జన్మింతురు. ఆ పుణ్యాక్షయము వలనను పాప అనుభవము వలనను ముక్తి గలుగుచున్నది. ఎన్నడును కర్మ నశించదు. కర్మ అనుభవింప దగినదే. కావున నీవు మరల కర్మ నాచరింపదగవు. పుత్రుడనైన నే నెక్కడ నుంచి వచ్చితిని. తల్లి వైన నీ వెక్కడ నుంచి వచ్చితివి. పుత్రత్వ మాతృత్వములలో వృథాభిమానము తప్ప మరేమియు లేదు. ఆలోచింపుము. తల్లి ఎక్కడ, తండ్రి ఎక్కడ, స్వామి ఎక్కడ, కుటుంబ మెక్కడ.

ఏవరును. ఎవరికిని సంబంధించి లేరు. అందరు స్వకర్మానుభవము చేయువారే. అమ్మా! ఇట్లు తెలుసుకొని ప్రయత్నముతో దుఃఖ మును త్యజించి పరలోక సుఖములకై శుభకర్మల నాచరింపుము.

అనగా గోవు ఇట్లనెను :

ఏవం జానామ్యహం పుత్ర మాయామాంస జహాత్యసౌ
త్వద్దుఃఖేన సుదుఃఖంమే తస్మైత్యో దాస్యే త దేవహి 30

పునశ్చ బ్రహ్మ హత్యాయాః నా శోయత్ర భవేదిహ
తత్థలంచయ యాదృష్టం హత్యామే హి గమిష్యతి 31

తా : కుమారా! ఆ విషయము నాకు తెలియును. అయి నను నన్ను మాయ వదలకున్నది. నీకు కల్గిన దుఃఖము నాకు మహా దుఃఖము కల్గించుచున్నది. అట్టి దుఃఖమునే ఆ బ్రాహ్మణు నకు కలుగజేయ గలను. బ్రహ్మహత్యా పాపము ఎచ్చట నశించునో అట్టి స్థలము నేను చూచితిని. నాకు బ్రహ్మహత్యా దోషము పోగలదు.

సూతుడిట్లనెను :

ఇత్యేత ద్వచనం శ్రుత్వా స్వమాతుర్గో ద్విపోత్తమాః
మౌనత్వం స్వీకృతం తత్ర వత్సేనోక్తం నకించిన 32

తా : బ్రాహ్మణులారా! అట్లు తల్లి చెప్పగా విని దూడ ఏమియు పలుకక మౌనముతో నుండెను.

తయోస్తద ద్భుతం వృత్తం శ్రుత్వా పాంథో ద్విజస్తదా
హృదా విచారయా మాస విస్మితోహి మునీశ్వరాః 33

ఇవ మత్యద్భుతం వృత్తం దృష్ట్వా ప్రాతర్మయాఖిలు
గంతవ్యం పునరేవాతో గంతవ్యం తత్ఫలం పునః 34

తా : బాటసారి యైన బ్రాహ్మణుడు ఆ అద్భుత వృత్తాంతమును విని ఆశ్చర్యము ఆంతరంగమున నిశ్చయించుకొని అట్టి అద్భుత స్థలమును నేను చూచి తరువాత. నా ప్రయాణమును సాగించ వలెనని నిశ్చయించు కొనెను.

విచార్వేతి హృదా విప్రః సద్విజః సేవకేనచ
సుష్వాప తత్ర జననీ భక్తః పరమ విశ్మితః 35

ప్రాతఃకాలే తదా జాతే గృహస్వామీ సముత్థితః
బోధయా మాస తంపాంథం వచనం బేద మబ్రవీత్ 36

తా ॥ ఇట్లు ఆ జననీ భక్తుడైన బ్రాహ్మణుడు మనసునందు నిశ్చయించుకొని సేవకునితో నిదురించెను. ప్రాతఃకాలమున గృహ యజమాని లేచి బాటసారుని లేపి ఇట్లనెను.

స్వపిషిత్వం కిమర్థంహి ప్రాతఃకాలో భవత్వలమ్
స్వయాత్రాం కురుతం దేశం గమనేచ్ఛా చయత్రహ 37

తేనోక్తం శ్రూయతాం బ్రహ్మన్ శరీరే సేవకస్యమే
కర్తతేహి వ్యథా స్థిత్వా ముహూర్తం గమ్యతే తతః 38

ఇత్యే వంచమిషం కృత్వా సుష్వాప పురుషస్తదా
తద్వృత్త మఖిలం జ్ఞాతు మద్భుతం విస్మయా వహమ్ 39

తా : పాంథా ! ప్రాతఃకాలమయినది. నిదురించు చుంటి వేల. నీవు వెళ్ళవలసిన స్థలమునకు ప్రయాణము సాగించుముః అనగా బ్రాహ్మణోత్తమా ! మా సేవకునకు శరీరములో బాధగా నున్నది. కొంచెము కాలమాగి ప్రయాణించెదము. అని మిష పెట్టి మరల నిదురించెను. ఆశ్చర్యకరమయిన వృత్తాంతమును తెలిసికొన గోరికతో నుండెను

దోహనస్య తదాకాలే బ్రాహ్మణః స్వసుతం ప్రతి
ఉవాచ గంతు కామశ్చ కార్యార్థం కుత్రచి చ్చసః 40

మయాతు గమ్యతే పుత్ర కార్యార్థం కుత్ర చిత్సునః
ధేనుర్దోహ్యా త్వయా వత్స సావధానా దియం నిజా 41

ఇత్యుక్త్వా బ్రాహ్మణ వరస్స జగాయ చకుత్ర చిత్
పుత్రః సముత్థితస్త త్రవత్సంచ ముక్తవాం స్తదా 42

మాతా చతస్య దోహార్థమా జగామ స్వాయం తదా
ద్విజ పుత్ర స్తదావత్సం ఖిన్నం కేతేన తాడితం 43

బంధనార్థం హిగోః పార్శ్వమన యుద్ధుగ్ధ లాలసః
పునర్గౌశ్చ తదా కృద్ధా శృంగేనాతాడ యచ్చతం 44

పపాత మూర్చాం సంప్రాప్య సోపి మర్మణి తాడితః
లోకాశ్చ మితితాస్తత్ర గవాబాలో విహింసితః 45

జలంజలం వదంతస్సై పిత్రాద్యా యత్ర సంస్థితాః
యత్నశ్చ క్రియతే యావత్తా వద్బాలో మృత స్తదా 46

మృతేచ బాలకే తత్రహాహాకారో మహానభూత్
తన్మాతా దుఃఖితా హ్యాసే ద్రురోధచ పునః పునః 47

కింకరోమి క్వగచ్ఛామి కోమే దుఃఖం వ్యపోహతి
రుదిత్వేతి తదాగాంచ తాడయిత్వా వ్యమోచయత్ 48

శ్వేతవర్ణా తదాసాగే ర్ద్రుతం బ్యామా వ్యదృశ్యత
అహోచ దృశ్యతాం లోకాః చుక్రుశుశ్చ పరస్పరమ్ 49

బ్రాహ్మణశ్చ తదా పాంధో దృష్ట్వాశ్చర్యం వినిర్గతః
యత్రగౌశ్చ గతస్తత్ర తామను బ్రాహ్మణో గతః 50

ఊర్ధ్వ పుచ్ఛంత దాకృత్వా శీఘ్రంగేః నందినీం ప్రతి
ఆగత్య నంది కస్యాస్య సమీపే నిర్మలే జలే 51

సం నిమజ్య త్రివారంతు శ్వేతత్వం చగతా హిసా
యథా గతం గతాసాచ బ్రాహ్మణో విసహ్మయం గతః 52

అహో ధన్యతమం తీర్థం బ్రహ్మహత్యా నివారణం
స్వయంచ మజ్జిత స్తత్ర బ్రాహ్మణస్సే. వకస్తదా 53

నిమజ్యాహి గతౌ తౌచ ప్రశంసంతౌ నదీంచతాం
మార్గే చమిలితా కాచిత్సుందరే భూషణాద్వితా 54

తా : ఉదయం పాలు పితుకు సమయమున బ్రాహ్మణుడు కార్యార్థియై ప్రయాణముచేయబోయి కుమారునితో "నేనుకార్యార్థము వెళ్ళుచుంటిని. మన అవును సావధానముగా పాలు పితుకుము." అని చెప్పి ప్రయాణమాయెను. కుమారుడు లేచి దూడ తాడు విప్పెను. అతని తల్లి కూడ అచ్చటికి వచ్చినది. బ్రాహ్మణ కుమారుడు కర్ర దెబ్బలకు బాధపడుచున్న దూడను ప్రక్కకు తీసెను. గోవు కోపముతో నాతని కొమ్ములతో పొడిచెను. ఆ బాలుడు మర్మ స్థలమున కొట్టబడుటచే నేలబడి మూర్ఛనొందెను. ప్రజ లందరు అవు బాలుని హింసించినది. జలమును కొనిరండు. అని కేకలు వేయుచుండగా నా బాలుడు మృతి నొందెను. అందరు బాలుని మరణమునకు హాహాకారములు చేసిరి. బాలుని తల్లి ఏమి చేయును. ఎక్కడకు వెళ్ళను? నా బాధను పోగొట్టువారెవరు అని దుఃఖించుచు అవును గట్టిగా కొట్టి వదలి పెట్టినది. తెల్లని రంగుగల ఆవు నల్లగా మారినది, ప్రజలందరు చూడుడని కేకలు వేసిరి. బాటసారి బ్రాహ్మణుడు అతని సేవకుడు ఆ దృశ్యము చూచి అవును వెంబడించి వెల్లిరి. ఆ ధేనువు తోక పైకెత్తి నందినీ తీర్థమునకు వెళ్ళి నందికేశ సమీపమున నిర్మల జలములో ముమ్మారు మునిగి లేవగా సహజమయిన శ్వేతవర్ణము మరల వచ్చినది. ఏమి ధన్యతమ తీర్థము? "ఇది బ్రహ్మహత్యా నివారకము" అని ప్రశంసించిరి. బ్రాహ్మణుడును సేవకుడు ఆ తీర్థమును ప్రశంసించుచు. అందు స్నానము చేసిరి. వారు ప్రయా

ణము చేయుచుండగా మార్గమున భూషణాన్వితయయిన నొక సుందరీమణి వారికెదు రైనది,

తయోక్తం తంచ భోపాంథ కుతోయాసి సువిస్మితః
సత్యం బ్రూహి ఛలంత్యక్త్వా విప్రవర్య మమాగ్రతః 55

తా : పాంథుడా, ఎచ్చటి నుండి వచ్చుచుంటివి నాయెదుట మర్మము వీడి నిజము చెప్పుము అని యడిగినది.

ఏవం వచస్తదా శ్రుత్వా ద్విజేనోక్తం యధాతథం
పునశ్చాయం ద్విజస్తత్రస్త్రియోక్తః స్త్రీయుతాంత్వయా 56

తయోక్తంచ సమాకర్ణ్య స్థితస్స బ్రాహ్మణ స్తతః
ప్రత్యువాచ వినితాత్మా కథ్యతే కింవదే తిచ 57

సాచాహ పునరేనా త్రత్వయాదృష్టం స్థలంచయత్
తత్రాధు నాకీ పాస్తినీ మాతుః కిం గమ్యతేఽవ్యతః 58

తా : ఆమె మాటలు విని బ్రాహ్మణుడు తన వృత్తాంత మంతను సవిస్తరముగ చెప్పెను. అప్పుడామె బ్రాహ్మణా! నిలువుము. అనగా నతడు వినయముతో చెప్పదలచినది. చెప్పుమనెను అంత నామె నీవు చూచిన స్థలమున నీ తల్లి అస్తికలను విక్షేపింపుము అనెను.

తవమాత పాంథవర్య సాక్షే ద్దివ్యమయం వతం
చెహంత్యక్త్వా ప్రే తం సాక్షాచ్ఛం భోర్యాస్యతి సద్గతిమ్ 59

వైశాఖే చైవ సంప్రాప్తే సప్తమ్యాంచ దినే శుభే
సితే పక్షే సదాగంగా హ్యాయాతి ద్విజ సత్తమ 60

అద్యైవ సప్తమీ యాసా గంగా రూపా స్థిత త్రవై
ఇత్యుక్త్వాం తర్దధే దేవీసా గంగాముని సత్తమాః 61

తా : పాంథుడా ! నీ తల్లి సాక్షా ద్దివ్యమయ దేహమును వదలి శంకరుని సద్గతి చెందును. వైశాఖ శుద్ధ సప్తమీ దినమున గంగానది ఈ తీర్థమునకు వచ్చును. నేడు సప్తమీ తిథి, మూర్తీభ వించిన గంగదేవియే ఇచ్చట నున్నదని చెప్పి అంతార్ధానమయినది.

నివృత్తశ్చ ద్విజః సోపి మాత్రస్థ్యర్థం స్వ వస్త్రతః
క్షిపేద్యా వత్తత్ర తీర్థేతా వచ్చిత్రమ భూత్తదా 62

దివ్య దేహత్వమా పన్నా స్వమాతాచవ్య దృశ్యత
ధన్యోసి కృత కృత్యోసి పవిత్రాంచ కులంత్వయా 63

ధనం ధాన్యం తథా చాయుర్వం శోవై వర్ధతాం తవ
ఇత్యాశిషం ముహుర్దత్వా స్వపుత్రాయ దివంగతా 64

తా : ఆ బ్రాహ్మణుడు పత్రము నుండి తల్లి అస్థికలు తీర్థములో విడిచినంతనే నతని తల్లి దివ్యదేహముతో సాక్షాత్క రించి ఇట్లన్నది. ధన్యుడవైతివి. కృతకృత్యుడ వైతివి. నీ కులము పవిత్రము చేసితివి. ధనధాన్యములతో పూర్ణాయువుతో నీ వంశము వృద్ధి పొందుగాక అని ఆశీర్వదించి దినమున కేగెను.

తత్ర భుక్త్వా సుఖంభూరి చిరకాలం మహోత్తమమ్
శంకరస్య ప్రసాదేన గతా సాహ్యుత్తమాం గతిమ్ 65

బ్రాహ్మణశ్చ సుతస్తస్యాః క్షిప్తాస్తీని పునఃతతః
ప్రసన్న మానసో భూత్వ శుద్ధాత్మా స్వగృహం గతః 66

తా : అచ్చట చిరకాలము సుఖము లనుభవించి శంకర ప్రసాదమున ఉత్తమగతి నొందెను.

తా : బ్రాహ్మణుడు తల్లి అస్తికలను ఆ గంగలోవైచి ప్రసన్న మానసుడై శుద్ధుడై స్వగృహమున కేగెను.

ఇతి శివ మహాపురాణే చతుర్థ్యాం కోటిరుద్ర సంహితాయాం నందికేశ్వర వర్ణనం బ్రాహ్మణీ స్వర్గతి వర్ణనం నామ షష్ఠోధ్యాయః

* * * * *
* * * * *

# నందికేశ శివలింగ మహాత్మ్యము

(శివ మహాపురాణం - చతుర్థ కోటి రుద్ర సంహిత)

## సప్తమాధ్యాయము

ఋషులు సూతునిట్లడిగిరి :

శ్లో॥ కథం గంగా సమాయాతా వైశాఖే సప్తమీ దినే
నందితీర్థే విశేషేణ సూతైత ద్వర్ణయ ప్రభో 1

ఈశ్వరశ్చ కథం జాతో నందికేశోహి నామతః
వృత్తం తదపి సుప్రీత్యా కథయత్వం మహామతే 2

తా : సూతుడా ! వైశాఖ శుద్ధ సప్తమి నాడు నందికేశ తీర్థమున గంగా సమాగమ మెట్లయినది. ఈశ్వరునకు నంకేశుడను పేరెట్లు గల్గినది చెప్పుము.

సాధుపృష్ఠ మృషి శ్రేష్ఠాః నందికేశాశ్రితం వచః
తదహం కథయామ్యద్య శ్రవణా త్పుణ్య వర్ధనమ్ 3

తా : ఋషి శ్రేష్ఠులారా ! నందికేశ సంబంధమైన వృత్తాంతము అడుగుట మంచిది. వినుటచేతనే పుణ్యవర్ధనమగు ఆ కథను చెప్పుచున్నాను. వినుడు.

శ్లో॥ బ్రాహ్మణీ ఋషికా నామ కస్యచిచ్చద్విజన్మనః
సుతా వివాహితా కస్మై చిద్ద్విజాయ విధానతః

పూర్వకర్మ ప్రభావేణ పత్నీ సాహి ద్విజన్మనః
సువ్రతాపిచ విప్రేంద్రాః బాల వైధవ్య మాగతా 5

తా : ఋషికా యను పేరుగల ఆమె ఒకానొక బ్రాహ్మణున కిచ్చి విధివిధానముగ వివాహము చేయబడినది. కాని పూర్వకర్మ ప్రభావముచే నామె భర్తను కోల్పోయి బాలవైధవ్యము పొందినది.

శ్లో॥ అథ సా ద్విజపత్నీహి బ్రహ్మచర్య వ్రతాన్వితా
పార్థివార్చన పూర్వం హితపస్తే పేసు దారుణమ్ 6

తా : అనంతర మా ద్విజపత్ని బ్రహ్మచర్య నిష్ఠురాలై పార్థివార్చ పూర్వకముగా మహాతపస్సు చేసెను.

తస్మిన్నవసరే దుష్టో మూఢనామా సురోబలీ
యాయౌ తత్ర మహామాయా కామబాణేన తాడితః 7

తా : అట్టితరి మూఢుడను పేరుగల దుష్ట రాక్షసుడు అచ్చటికేగి కామ పరవశుడాయెను.

తపం తీంతాం సమాలోక్య సుందరీమతి కామినీం
తయా భోగం యయాచేస నానా లోభం ప్రదర్శయన్ 8

అథసా సువ్రతా నారీ శివధ్యాన పరయణా
తస్మిన్ దృష్టిం దథౌనైవ కామదృష్ట్యా మునీశ్వరాః 9

తా : తపస్సు చేయుచున్న ఆ సుందరిని చూచి అనేక లోభములను చూపుచు ఆ దుర్మార్గుడు ఆమె సంగమమును కోరెను

కాని ఆ వ్రత నిష్ఠురాలైన ఆమె శివధ్యాన పరాయణురాలై ఆతని యందు కామదృష్టిని ప్రసరింప లేదు. చూడనూలేదు.

శ్లో॥ న మాని తవతీతంచ బ్రాహ్మణీ సాత పోరతా
అతీవహి తపోనిష్టాని చ్ఛివధ్యాన మాశ్రితా 10

తా : ఆ బ్రాహ్మణి తపో నిరతురాలై మిక్కిలి నిష్ఠతో శివధ్యాన పరాయణురాలై ఆ దుష్టుని లెక్కచేయలేదు.

అథ మూఢః సదైత్యేంద్రః తయాతస్యా తిరస్కృతః
చుక్రోధ వికటం తస్య పశ్చాద్రూపమ దర్శయత్ 11

తా : ఆ దైత్యుడైన మూఢుడు ఆమెచే తిరస్కరింపబడిన వాడై కోపగించి వికట రూపమును దాల్చెను.

అథ ప్రోవాచ దుష్టాత్మా దుర్వచో భయకారణమ్
త్రాసయామాస బహుశస్తాంచపత్నీం ద్విజన్మనః 12

తా : ఆ దుర్మార్గుడు ఆ ద్విజపత్నిని భయప్రదములైన దుర్భాష లాడుచు భయపెట్టసాగెను.

తదాసా భయసం త్రస్తా బహువారం శివేతిచ
బభాషే స్నేహత స్తస్యా ద్విజపత్నీ శివాశ్రయా 13

తా : ఆమె భయముతో వణకుచు శివుని దృఢముగా నమ్మి శివ, శివ అని పలుమారు పలుకసాగెను.

విహ్వలాతీవసా నారీ శివనామ ప్రభాషిణీ
జగామ శరణం శంభోః స్వధర్మా వనహేతవే 14

తా : ఆమె శివ నామస్మరణ చేయుచు భయ విహ్వలు రాలై స్వధర్మ రక్షణకు శంకరుని శరణు వేడెను.

శరణాగత రక్షార్థం కింతు సద్వృత్తమా హితమ్
ఆనందార్థం హితస్యాస్తు శివ ఆవిర్భ భూవహ 15

తా : ఆమె సత్ప్రవర్తనకు సంతసించి శరణాగత రక్షణ కొరకును ఆమెకు సంతోషము కలుగ జేయుటకును శివుడు ప్రత్యక్ష మాయెను.

అథతం మూఢ నామానం దైత్యేంద్రం కామ విహ్వలమ్
చకార భస్మ సాత్సద్యః శంకరో భక్తవత్సలమ్ 16

తా : కామ పరవశుడైన ఆ మూఢుడను దైత్యేంద్రుని భక్తవత్సలుడగు శంకరుడు భస్మము చేసెను,

తతశ్చ పరమేశానే కృపా దృష్ట్యా విలోక్యతాం
వరం బ్రూహీతి చోవాచ భక్తరక్షణ దక్షధీః 17

తా : అంత భక్తరక్షణ దక్షుడైన పరమేశ్వరుడు ఆమెను కృపాదృష్టితో చూచి వరము కోరుకొనుమనెను.

శ్రుత్వా మహేశ వచనం సాసాధ్వీ ద్విజ కామినీ
దదర్శ శాంకరం రూపమానంద జనకం శుభమ్ 18

తతః ప్రణమ్యతం శంభుం పరమేశం శుఖావహం
తుష్టావ సాంజలి స్సాధ్వీన తస్కంధా శుభాశయా 19

తా : సాధ్వీయగు నా కామిని మహేశుని వాక్యము విని ఆనందయ జనకము శుభావహమునగు శంకరుని దివ్యరూపమును చూచినది. అనంతరము ఆ సాధ్వీమతల్లి అంజలి ఘటించి, శిరము వంచి, లోక శుభేచ్ఛతో శంకరుని స్తుతించెను.

శ్లో॥ దేవదేవ మహాదేవ శరణాగత వత్సల
దీనబంధుస్త్వ మీశానో భక్త రక్షాకరః సదా 20

తా : శరణాగత వత్సల, మహాదేవ, దీనబంధో! నీవు సదా భక్త రక్షాకరుడవు.

త్వయామే రక్షితో ధర్మో మూఢనామ్నా సురాదిహ
యదయం నిహతో దుష్టో జగద్రక్షా కృతా త్వయా 21

తా : మూఢ నాముడగు యీ రాక్షసుని చంపుటచే నా ధర్మమును రక్షించుటయే గాక నీచే జగద్రక్ష చేయబడినది.

స్వపాదయోః పరా భక్తిం దేహిమేహ్యా నపాయినీం
అయమేవ వరోనాథ కిమన్య దధికం హ్యతః 22

అన్యథా కర్తయ విభో ప్రార్థనాంమే మహేశ్వర
లోకానా ముపకారార్థ మిహత్వం సంస్థితో భవ 23

తా : నీ పాదములందు ఎడతెగని పరాభక్తిని నా కనుగ్రహింపుము. ఇదియే నాకు వరము. ఇంతకన్నా అధికమైనదేది కలదు? మహేశ్వర! మరొక్క ప్రార్థనను అవధరింపుము. ఏమన లోకోపకారార్థము నీ విచ్చట స్థిరముగా నుండుము.

ఇతి స్తుత్వా మహాదేవ మృషికాసా శుభవ్రతా
తూష్ణిమా సాథ గిరిశః ప్రోవాచ కరుణాకరః 24

తా : శుభ్రవతురాలైన ఆ ఋషికాదేవి మహాదేవుని స్తుతించి యూరకుండెను. అంత కరుణాకరుడైన శంకరుడిట్లనెను.

ఋషికేసు చరిత్రాత్వం మమభక్తా విశేషతః
దత్తావరాశ్చతేసర్వే తుభ్యం యే యేహి యాచితాః 25

తా : ఋషికా! నీవు సచ్చరిత్రవు. విశేషించి నా భక్తురాలవు. యే యే కోరికలు గలవో అవి అన్నియు ప్రసాదించుచున్నాను.

ఏతస్మిన్నంతే తత్ర హరి బ్రహ్మాదయ స్సురాః
శివావిర్భావ మాజ్ఞాయ యముర్హర్ష సమన్వితాః 26

తా : అంత హరి బ్రహ్మాదులైన దేవతలందరు శివావిర్భావ మును తెలుసుకొని హర్షముతో అచ్చటికి వచ్చిరి.

శివం ప్రణమ్య సుప్రీత్యా సమానర్చుశ్చతేఽఖిలాః
తుష్టుపుర్నతకావిప్రా (నమ్రశిరసః) కరేబద్ధా
సుచేతసః 27

తా : దేవత లందరు నమ్ర శిరస్కులై చేతులు జోడించి శుద్ధ మనస్సులతో శివునకు నమస్కరించి అర్చించిరి,

ఏతస్మి న్సమయే గంగా స్వాభ్యేతాం స్వర్ధునీ జగౌ
ఋషికాం సుప్రసన్నాత్మా ప్రశంసంతీచ తద్విధిమ్ 58

తా : ఇంతలో స్వర్గగామిని యగు గంగాసాధ్వి నిర్మల మనస్సుతో ఋషికాదేవిని ఆమె విధానమును ప్రశంసించెను.

గంగ ఇట్లనెను :

మహూర్తే చైవ వైశాఖే మాసిదేయం త్వయా వచః
స్థిత్యర్థం దినమేకం మే సామీప్యం కార్యమేవహి 29

తా : నా కొరకు వైశాఖమాసము నందొక్క దినము నా సామీప్యము నం దుండవలెను. అట్లు వాగ్దానము చేయవలయును.

గంగావచన మాకర్ణ్యసా సాధ్వీ ప్రాహసువ్రతా
తథాస్త్వితి వచః ప్రీత్యా లోకానాం హిత హేతవే 30

ఆనందార్థం శివస్తస్యాః సుప్రసన్నశ్చ పార్థివే
తస్మిన్లింగే లయం యాతః పూర్ణాంశేన తయా హరః 31

దేవా స్సర్వేపు ప్రసన్నాః ప్రశంసంతి శివంచతామ్
స్వం స్వంధామ యయుర్విష్ణు బ్రహ్మద్యా అపి స్వర్ణదీ 32

తా : గంగావచనము విని ఆ సాధ్వి లోకముల హితము కొరకు తథాస్తు అని కోరెను. అంత శివుడు సుప్రసన్నుడై ఆ పార్థివ లింగమందు పూర్ణాంశతో లీనమయ్యెను. దేవత లందరు సుప్రసన్నులై శివుని, ఆమెను ప్రశంసించుచు, విష్ణు బ్రహ్మాదులు, గంగానదియు అందరు స్వస్వధామములకు వెడలిరి.

తద్దినాత్పావనంతీర్థ మాశీదీ దృశముత్తమమ్
నందికేశః శివఃఖ్యాతః సర్వపాప వినాశనః 33

తా : ఆ దినము మొదలు ఆ తీర్థ ముత్తమ మైనదియు పావనమైనదియు అయెను. సర్వపాప వినాశకుడగు శివుడు నందికేశు డయ్యెను.

గంగాపి ప్రతివర్షం తద్దినే యాతి శుభేచ్ఛయా
క్షాళనార్థం స్వపాపస్య యద్గృహీతం నృణాం ద్విజాః 34

తా : శౌనకాది ఋషులారా! గంగాదేవియు ప్రతి సంవత్సరము, ఆ దినమున జనులు తనలో స్నానము చేసి వదలిన పాపమును క్షాళన చేసుకొనుటకు అచ్చటికి వచ్చుచుండును.

తత్రస్నాతో నరః సమ్యక్ నందికేశం సమర్చ్యచ
బ్రహ్మ హత్యాదిభిః పాపై ర్ముచ్యతే హ్యఖిలైరపి 35

తా : నరుడు అచ్చట స్నానము చేసి నందికేశుని అర్చించిన, బ్రహ్మ హత్యాది సర్వపాపముల నుండి విముక్తుడగును.

ఇతి శ్రీ శివ మహాపురాణే చతుర్థ్యాం రుద్రకోటి సంహితాయాం నందికేశ శివలింగ మహత్మ్య వర్ణనం నామ సప్తమోధ్యాయః (7)

తరువాత గోకర్ణాది శివలింగ వర్ణనము.



క్రిమి కీట పతంగేషు తిర్యగ్యోనింగతస్యవా
జన్మజన్మాంతర్యేవస్తు భక్తిర్మయి మమాచలా 6
తథేత్యుక్త్వా మహదేవః పరయా కృపయా నృప
గృహీత్వాతం కరేసిద్ధం జగామ నిలయం హరః. 7

తా : రాజేంద్రా! అనంతరము మహానంది సిద్ధిపొందిన నంది కేశ్వరమునకు పోవలెను. దాని మహత్మ్యమును చెప్పెదను.

పూర్వము గణేశ్వరుడైన నంది రేవాతీరమున తపమాచరించి జయమును పొంది ఒకతీర్థము నుండి మరొక తీర్థము చేరెను ఇట్లు దధిస్కందము మధుస్కందము అతిక్రమించగా మహా దేవుడు సంతుష్టుడై నందినాథునితో నిట్లనెను.

ఓయి నందీశ్వర! నీ తీర్థయాత్రా కృతమైన తపస్సువల్ల సంతుష్టుడనైతిని. వరమిచ్చెద కోరుకొనుము అనెను.

అందుకు నందీశ్వరుడు నేను విత్తనమును కోరను. కుల సస్తతిని కోరెను. నీ పాదపద్మ సేవకంటె వేరుగా దేనినీ కోరననెను. జన్మ జన్మాంతరములలో నేను క్రిమి కీటకాదులలో గాని, తిర్యగ్జంతువులలో గాని ఏ జన్మ ఎత్తినను నీ యందు నిర్మల భక్తి తప్ప వేరేమియు కోరను అనెను.

అంత మహాదేవుడు అట్లగుగాక యని పరమ దయతో నందికేశ్వరుని చేతితో పట్టుకొని తన నిలయమునకు చనెను.

శ్లో॥ తస్మిన్తీర్థేతుయః స్నాత్వా భక్త్యాత్ర్యక్షం ప్రపూజయేత్
అగ్నిష్టో మస్య యజ్ఞస్య ఫలం ప్రాప్నోతి మానవః 8

తత్ర తీర్థేతుయః స్నాత్వా ప్రాణత్యాగం కరోతిచేత్
శివస్యాను చరోభూత్వామోచతే కల్ప మక్షయమ్ 9

తతః కాలేన మహతా జాయతే విమలే కులే
వేదవేదాంగ తత్త్వజ్ఞో జీవేత్ శరదాం శతమ్ 10

ఏతత్తే కథితంతాత తీర్థ మాహాత్మ్య ముత్తమం
దుర్లభం మర్త్యసంఘస్య సర్వపాప క్షయం కరం 11

ఇతి స్కాందే మహాపురాణే ఏకాశీతి సహస్రాయాం
సంహితాయాం పంచమే అవంతీఖండే, రేవాఖండే నంది
కేశ్వర తీర్థమాహాత్మ్య వర్ణనం నామ అశీతితమోధ్యాయః
(80 - అధ్యాయము)

తా : ఎవరు ఆ తీర్థమందు స్నానము చేసి భక్తితో శంకరుని పూజింతురో వారు అగ్నిష్టోమాది యజ్ఞములను చేసిన ఫలము నొందుదురు, ఆ తీర్థమందు స్నానము చేసి మరణించిన వారు శివుని అనుచరులై కల్పాంతము వరకు సుఖింతురు తరువాత చాల కాలమునకు విమలమైన వంశమున జన్మించి వేదవేదాంగ తత్వ జ్ఞులై నూరు సంవత్సరములు జీవింతురు. ఇట్టి మహాతీర్థ మహాత్య మును చెప్పితిని. ఇట్టి సర్వ పాప క్షయకరమైన మహాతీర్థము మర్త్య సంఘమునకు దుర్లభము.

ఎనుబదవ అధ్యాయము(80)

94వఅధ్యాయము

చతుర్నవతి తమో ధ్యాయః

# నందికేశ్వర తీర్థ మహాత్మ్య వర్ణనం

శ్రీ మార్కండేయ ఉవాచః

తస్యైచానంతరం రాజన్నంది తీర్థం వ్రజేత్ శుభం
సర్వ పాపహరం పుంసాం నందినా నిర్మితం పురా 1

పాపాషు హతజం తూనాం మోక్షదం సర్వదా తటే
అహో రాత్రోషితోభూత్వా నందినాథే యుధిష్ఠర 2

పంచోపచార పూజాయా మర్చయే న్నందికేశ్వరం
రత్నానిచైవ విప్రేభ్యోమోదద్యా ధ్ధర్మనందన 3

సయాతి పరమం స్థానం యత్ర వాసః పినాకినః
సర్వసౌఖ్య సమాయుక్తోఽప్సరోభిః సహమోదతే 4

ఇతి శ్రీ స్కాందే మహాపురాణే ఏకాశీతి సహస్ర్యాం
సంహితాయాం పంచమే అవంతీఖండే, రేవాఖండే నంది
కేశ్వర తీర్థమహాత్మ్యం నామ చతుర్నవతి తమోధ్యాయః
(94 అధ్యాయము)

తా : రాజా! దానితరువాత పూర్వము నందిచే నిర్మింపబడి సర్వ పాపహరమగు నందితీర్థమును చేరవలెను. పాపములచే పీడింపబడువారికి మోక్షమిచ్చునది. ధర్మరాజా, నందితీర్థపుటొడ్డున అహోరాత్రముండి నందికేశ్వరుని పంచోపచారములతో పూజించి బ్రాహ్మణులకు రత్నముల దానము చేసినవారు శంకరుని పరమ స్థానమును చేరి సర్వ సౌఖ్యములను పొంది అ ప్స ర స ల తో విహరించుచుందురు.

94 వ అధ్యాయము

( స్కాంద మహాపురాణము )

* * * * *

# గ రు డ మ హా పు రా ణ ము

శ్రీ గారుడే మహాపురాణే పూర్వఖండే ప్ర థ మాం శా ఖ్యే. ఆచారకాండే సర్వతీర్థ మహాత్మ్యం నామ ఏకాశీతి తమోధ్యాయః

( 81 అధ్యాయము )

శ్లో॥ నందితీర్థంముక్తి దంచ
కోటితీర్థం ఫలప్రదం 21

తా : నందితీర్థము ముక్తి నొసగునది, కోటి తీర్థముల ఫలము నిచ్చునది.



# స్కాందపురాణం శ్రీశైలఖండము

## ( మహానంది )

సంకలనము :

శ్రీ మద్దులపల్లి వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి, నంద్యాల.

పరిష్కర్త :

"విద్యాభూషణ" భాస్కరపంతుల మాణిక్యశర్మ, కర్నూలు.

(దేవస్థానము లో నున్న వ్రాతప్రతి)

మహానంది అతి పురాతన క్షేత్రము. యుగాంతరములలో గూడ యీ క్షేత్రమునకు సంబంధించిన పురాణ గాథలు కలవు. స్కాంధ మహాపురాణములోని శ్రీశైల ఖంతమునందలి 41 మొదలు 46 అధ్యాయములలో మహానందికి సంబంధించిన పురాణ గాథలు గలవు.

శ్రీశైల క్షేత్రమునకు దక్షిణ దిశనున్న మహాపుణ్యస్థలము మహానంది. జల ప్రధానములు తీర్థములనియు స్థల ప్రధానములు క్షేత్రములనియు వ్యవహార ముండుటచే మహానంది యందు సాక్షాత్ పరమ శివుడు నందీశ్వరుడుగా అవతరించుటయు గంగాభవాని అచ్చటనే ఆవిర్భవించుటయు జరగుటచే ఈ ప్రదేశము క్షేత్ర.

తీర్థముల మేలు కలయికలై సర్వోత్తమమైన పుణ్యస్థల రాజమైనది.

శ్రీశైల క్షేత్రమునకు నాలుగు దిక్కులను నాలుగు ప్రసిద్ధ ద్వారములు గలవు.

తూర్పు : త్రిపురాంతకము - 100 మైళ్ళ దూరము. మార్కాపురం తాలూకా.

దక్షిణము : సిద్ధవటము 200 మైళ్ళు, కడపజిల్లా. పినాకినీ తీరము.

పశ్చిమము : అలంపురము - 100 మైళ్ళు. కర్నూలుకి 5 మైళ్ళ దూరము.

ఉత్తరము : ఉమామహేశ్వరము - 60 మైళ్ళు మహబూబ్‌నగర్ జిల్లా.

చుట్టుపట్ల మహాక్షేత్రము మహానంది, ఓం కారము అహోబిలము, పుష్పగిరి.

## మహానంది - ప్రాదుర్భావము

నంది యను పేరుతో ఈశ్వరుడే అవతరించిన సర్వోన్నత శివక్షేత్రము "మహానంది" అనబడినది. కృతయుగమున శిలాదుడు

అను మహర్షి సంతానము కొరకు ఘోరతపస్సు చేసెను. అతడు జల, శిల, వాయు భక్షణ చేయుటచే శిలాదుడని వ్యవహారము కల్గెనందురు. అతని తపస్సునకు మెచ్చి శివుడు సాక్షాత్కరించి వరము కోరుమనగా జగత్ప్రసిద్ధులు, భక్తులు అగు కుమారులు కావలెనని కోరెను. ఆ వరప్రసాదముగ లభించిన కుమారులే (1) పర్వతుడు, (2) నంది అయిరి.

అందు పర్వతుడు ఈశ్వరుని గూర్చి తపస్సు చేసి శ్రీశైల పర్వతముగా జన్మించి నిరంతరము శ్రీ మల్లికార్జున రూపుడైన శివుడు శిరముపై ధరించుచుండెను.

నంది విషయములో శిలాదుని కోరిక అయోనిజుడు కావలెనని యుండుటచే శివుడిట్లనెను.

అధ్యాయము - 42

శ్లో॥ తథైవ భవతో బ్రహ్మన్ భవిష్యతి మహాగుణః
పవిత్రోఽయోనిజః పుత్రః యాదృశస్తే మనోరథః

తవశీరముఖే నాశుభూమి బాగా దుదేష్యతి
భవితా సచమే పార్శ్వే స్థాతాత్రి దశ పూజితః

అధ్యాయము - 43

స్వయం సీరముఖా కృష్టాద్భూ తలాత్కలి తోదయః

తా : బ్రాహ్మణ శ్రేష్ఠుడా! నీవు కోరినట్లే మహాగుణా వంతుడు, పవిత్రుడు, అయోనిజుడు అయిన పుత్రుడు కలుగు

గలడు. నాగలి కొనచే లేచిన భూభాగము నుండి ఉదయించగలడు దేవతలచేత పూజింపబడినవాడై నా పార్శ్వమునందే యుండగలడు.

అట్టి వరముతో సంతుష్టుడై శిలాదుడు యజ్ఞార్థము నాగలితో నేల దున్నుచుండగా శిలాదునకు మగశిశువు కన్పించెను. ఆశిశువును చూచి శిలాద దంపతులు ఆనందభరితులై తమ కానంద సందాయకుడగుటచే నతనికి "నంది" అని నామమిడిరి. అతడే మహానందుడు.

శిలాదుడు కుమారుడైన నందికి ఉపనయనము చేసి వేద, వేదాంగములను పఠింపచేసెను. నంది తండ్రి దగ్గరనే విద్యాభ్యాసము చేసెను.

## నంది తపస్సు చేయుట - శివ దర్శనము

అధ్యాయము - 43

శ్లో॥ సకదాచి దథ శ్రీమాన్ శిలాదస్య సుతః సుధీః
నందీ నిగమ విచ్ఛ్రేష్ఠ శ్రేష్ఠః సర్వ తపస్వినామ్
తపసే కృత సంకల్పః స్వల్పీకృత బహిస్సుఖః ॥

తా : బుద్ధిమంతుడు, తేజస్సంపన్నుడు నగు నంది వేద వేత్తలలోను, తపఃశ్రేష్టులలోను అగ్రగణ్యుడై బహిస్సుఖములయందు విముఖుడై తపస్సు చేయ సంకల్పించెను.

అట్టి సంకల్పముతో తల్లిదండ్రుల యనుమతి నొంది శ్రీశైలమన ఘోర తపస్సు చేసెను.

శ్లో॥ దివ్యవర్ష సహస్రంచ నిరాహారో బభూవసః
దివ్యం వర్ష సహస్రం సంతప్తో పంచాగ్ని మధ్యగః
పంచవర్ష సహస్రాణి తపః కుర్వన్ మహామతిః
వాలఖిల్యైర్వృతస్సర్వై ర్మని దేవగణైరపి
శ్వేత నందీ, మహానందీ, సునందీ త్రివిధోఽభవత్

తా : వేయి సంవత్సరములు నిరాహారుడై, వేయి సంవత్సరములు పంచాగ్ని మధ్యస్థుడై అయిదువేల సంవత్సరములు మహా తపస్సు చేసి వీతకల్మషుడయి మహాతేజశ్శాలి యగుటచే వాలఖిల్యాది సర్వ దేవ ముని గణములచేత శ్వేతనంది, మహానంది, సునంది అను సార్థక నామములు కలవాడయ్యెను. శివుడు ప్రసన్నుడై వరమడుగు మనెను.

శ్లో॥ యది మేత్వం ప్రసన్నోఽసి వరందాతుం యదీచ్ఛసి
భూయోవర్ష సహస్రాణి కర్తుమిచ్ఛామ్యహం తపః
తథైవాస్తు తవ బ్రహ్మన్ యాదృశస్తే మనోరథః
భూయోవర్ష సహస్రాణీ తీర్థేతీర్థే మహాతప
తపః కురుష్వ భద్రంతే మనసా యద్యదిచ్ఛసి
తానితాన్యపి తీర్థాని త్వన్నామాని భవంత్వపి

తా : అందులకు నంది శంకరునితో స్వామి నీవు ప్రసను డవై నాకు వరదానము చేయుదువని మరల వేయి దివ్యవర్షములు తపస్సుచేయ దలచితిని అనుగ్రహింపుమనెను అందులకు శంకరుడు మెచ్చి ప్రతి తీర్థమునందు నీ కోరిక ప్రకారము తపస్సు చేయుము ఆ తీర్థము లన్నియు నీ పేరుతో ప్రసిద్ధి చెందగలవు. అని వర మిచ్చెను. అట్లు శంకరునిచే ప్రోత్సహింప బడినవాడై చిరకాలము తపస్సు చేయుగా ఈశ్వరుడు సాక్షాత్కరించి ఇట్లనెను.

శ్లో॥ ప్రసన్నోస్మి తవబ్రహ్మన్ అహమేష మహేశ్వరః
యద్య దస్తీప్సితం నందిన్ తత్తద్వరయ సువ్రత

తా : బ్రాహ్మణోత్తమా! నేను మహేశ్వరుడను నీ తపస్సుకు మెచ్చి ప్రసన్నుడనైతిని. నీ కోరిన వరమేదియో కోరుకొనుమని శంకరుడనెను.

శ్లో॥ యది మేత్వం ప్రసన్నోసి మహాదేవ దయానిధే
సఫలీ క్రియతామేషా ప్రార్థనా భక్తవత్సల
యథా తవ పదద్వంద్వం మదగ్రే స్ఫురితం భవేత్
తథా తవ మహాదేవ వరద స్సర్వదా మమ

తా : దయానిధీ, మహాదేవ ! నాకు ప్రసన్నుడవైన యెడల నిరంతరము నీ పాద ద్వంద్వము నాకు ఎదుట కన్పించునట్లుండ వలెనను నా ప్రార్థనను సఫలము చేయుము.

అందులకు ఈశ్వరుడు సంతుష్టుడై నీవు తపస్సు చేసిన చోట నేను అర్చారూపముగ అవిర్భవించెదను. ఈ ప్రదేశము నందిమండలమని పేరొందును. ఇంతియేగాక, ఈ నందిమండలములో నేను "నవ" నందీశ్వరుల నామములతో అచ్చటచ్చట వెలయగలను. ఈ నవ నందీశ్వరులకు పాలకుడుగా బ్రహ్మ నందీశ్వరుడను. పేరుతో వెలయుదును. మరియు నిన్ను నేను వాహనముగా స్వీకరింతును. నా సన్నిధి నుండుమని నందీశ్వరుని చేరదీసెను.

శ్లో॥ ఏవం లబ్ధవరో నందీ కళ్యాణగుణ వానభూత్
తస్య నామ్నాతు తత్తీర్థం త్రిషు లోకేషు విశ్రుతః
సర్వతీర్థాని పుణ్యాని తత్ర సన్నిహితాన్యపి
తస్మిన్ తీర్థేఽంభసిస్నాత్వా పీత్వాత దమృతం శుభం
కృతకృత్యవిధి ర్ధీమాన్ కృతకృత్యో భవేన్నరః

తా : ఇట్లు వరములు పొందిన నందీశ్వరుడు కళ్యాణ గుణవంతుడయ్యెను. అతని పేరుతో ఆ తీర్థము "మహానంది" అని ముల్లోకములలోను ఖ్యాతి గాంచినది బ్రహ్మాండములోని సర్వ తీర్థములు అక్కడ సన్నిహితములై యుండును. ఆ తీర్థములో స్నానముచేసి, అమృతము వంటి ఆ తీర్థమును త్రాగిన సర్వ కర్మలను ఆచరించిన ఫలము గలవాడై కృతకృత్యుడగును, విజ్ఞాన సంపన్నుడై తుదకు శివసాయుజ్యము నొందును.

# నంది మండలములోని నవనందులు

## సర్వపాలకుడు బ్రహ్మనంది

1) మహానంది : ప్రకృతమున గల మహానంది క్షేత్రమే.

2) వినాయకనంది : మహానంది దేవాలయమునకు దక్షిణ భాగమున ప్రాకారమునకు దగ్గరగ కలదు

3) గరుడనంది : మహానంది క్షేత్రములోనే పశ్చిమ భాగమున దేవాలయ ముఖమంటపమునకు పడమరగా నొక ఫర్లాంగు దూరములో గలదు.

4) సూర్యనంది : మహానందికి దక్షిణమున నాల్గుమైళ్ళ దూరమున తంబళ్ళపల్లి అను గ్రామమునకు దగ్గరగా గలదు. ఉదయము సూర్యకిరణములు స్వామిపై పడుచుండును. కావున సూర్యనంది అని పేరు వచ్చినది.

5) సోమనంది : నంద్యాల పట్టణమునకు తూర్పుద్వారమున నున్నది.

6) నాగనంది : నంద్యాల పట్టణములో పడమట ఆంజనేయ స్వామి దేవాలయములో అంజనేయస్వామి గర్భా లయమునకు ముందు ఎడమవైపున గలదు.

7) ప్రమథనంది : (ప్రథమనంది) - నంద్యాల పట్టణమునకు నైరుతి భాగమున మైలు దూరములో "చామ" కాలువ ప్రక్కనున్నది.

8) శివనంది : నంద్యాల పట్టణమున కీశాన్యభాగమున ఎనిమిది (8) మైళ్ళ దూరముననను, మహానందికి వాయవ్యమున ఆరు (6) మైళ్ళ దూరముననను, కడమాలకాల్వ అను గ్రామమున గ్రామమునకు దక్షిణ భాగమున ఒక ఫర్లాంగు దూరములో నున్నది.

9) విష్ణునంది (కృష్ణనంది) : మహానందికి ఉత్తరమున 22 మైళ్ళ దూరములో నల్లమల నానుకొని యున్నది.

10) బ్రహ్మనంది : నంద్యాలపట్టణములో కోట అనుభాగములో పట్టణ మధ్యమున నున్నది.



# మహానంది - గోపాద చిహ్నము

ఈశ్వరుడు మహానందికిచ్చిన వరము ప్రకారము అచ్చట ఈశ్వరుడు పుట్టరూపమున లింగాకారము ఆవిర్భవించెను. అరణ్య ప్రాంతమగుటచే ప్రక్క గ్రామములోని ఆవు గడ్డి మేయుటకు వచ్చెను. పుట్ట సమీపములో ఆవు తిరుగుచుండగా పుట్టలో నుండి ఒక బాలుడు ఆవుపాలు త్రాగుచుండెను. ప్రతిదినము ఇట్లు బాలుడు పాలు త్రాగుచుండుటచే దూడకు పాలు చాలక యజమాని బాధపడెను. అనుమానముతో కాపరిని బెదిరించగా తనవల్ల దోషము లేదని నిరూపించుటకు ఆవు విషయము జాగ్రత్తగా పరిశీలింపగా బాలుడు పాలు త్రాగుట బయటపడినది. ఇది గమనించిన గోపాలుడు యజమానితో చెప్పగా యజమాని స్వయముగా గోవుతో అడవికి వచ్చెను. అతనికి కూడ బాలుడొకడు ఆవు పాలుత్రాగుట కనుపించగా పాలు త్రాగుచున్న బాలుని కొట్టుటకు పరుగెత్తెను. ఆవు కంగారుగా పారిపోయెను. బాలుడు అంతర్ధానమయ్యెను తొందరలో ఆవు లింగమును తొక్కెను. ఆ రాత్రి యజమానికి స్వప్నమున శంకరుడు కనుపించి నేను నందీశ్వరుడను. పుట్టలో నుండి ఆవు పాలు త్రాగుచున్నది నేనే అని చెప్పెను అదియునుగాక నీ జన్మాంతర కృత పుణ్యఫలముచే ఆవు మూలమున నా దర్శన మైనది. ధన్యుడవైతివి. ప్రతిదినము నాకు గోక్షీరములు సమర్పించి తరింపుము అని ఆనతిచ్చెను. అంత నా యజమాని సంతోష భరి

తుడై ప్రతిదినమును మహానందీశ్వరునకు గోక్షీరము అర్పించుటయే గాక గోవును కూడ సమర్పించెను. అతడు ధన్యుడయ్యెను.

## మహానంది - లింగాకారము

మహానందిలో శివలింగము గుండ్రముగా లేక పుట్టవలె నుండును పుట్టకోపులవలె రంధ్రములతో నిండియుండును. లింగములో రంధ్రములు కనుపించును. గోపాదము దిగబడినట్లు గుర్తు కూడ కనిపించును విమర్శించినచో సత్యము తెలువగలదు.

పుట్ట మొదట మట్టిగా నుండి క్రమముగా శిలయగుట పరిణామ లక్షణము కావచ్చును.

*****

# రససిద్ధుడు - దేవాలయ గోపురముల సృష్టి

రససిద్ధుడను యోగి కైలాసమున శివ పరిచారకుడు. అను మాది అష్టసిద్ధులు సాధించిన మహాయోగి.

ఒకానొకనాడు పరమేశ్వరుడు ప్రదోషకాలమున నటనా నంతరము ఆ భక్తునితో నేను మహానందికిచ్చిన వరము ప్రకారము భూలోకములోనందిమండలమున నవనందులుగా వెలసియున్నాను నందిమండలము పంచక్రోశ పరిమితము. అచ్చటి పుట్టలో స్వయం భూలింగముగ వెలసియున్నాను. నందికిచ్చిన వరము ప్రకారము అక్కడ అర్చా విగ్రహ రూపముననున్న నాతోపాటు సమస్త దేవతలు, గంగానది సర్వ పుణ్య తీర్థములు, సన్నిహితములుగా నుండును. నీవు నీ సిద్ధులతో ప్రజల నాకర్షించి దేవాలయములు నిర్మింపుమని ఆజ్ఞాపించెను.

అంత శివాజ్ఞచే రససిద్ధుడు ఆకాశగమనమున వచ్చిన నవ నందీశ్వర స్థలముల దర్శనము చేసి దేవాలయములను కట్టించెను కార్మికులకు వేతనముగా ఇసుకను కుప్పలు చేసుకొనుడని చెప్పి తన అమృతకలశముతో ఆ కుప్పలను తాకించగా వారువారు చేసిన పనికి తగిన ధనము ఆ ఇసుక కుప్పలలో దొరుకు చుండెను. ఈ ప్రకారము మహానంధిలో శివాలయము, ఇతర దేవాలయములు ప్రాకారమంటపములు కట్టించెను. స్వామి సన్నిధినుండి ప్రవహించు రుద్ర తీర్థమునకు ప్రాకారములో పుష్కరిణి (కోనేరు) నేర్పాటు చేసెను.

దేవాలయమునకు దక్షిణమున విష్ణుతీర్థమునకును, ఉత్తరమున బ్రహ్మతీర్థమునకును పుష్కరిణులు నిర్మించెను. అట్లే పంచ క్రోశములలోని నవనందులకును, పాలకుడగు బ్రహ్మ నందీశ్వరునకును దేవాలయ, గోపుర, ప్రాకారాదులు నిర్మించెను. అన్నింటికిని నిత్యపూజలు ఏర్పాటు చేసెను. అది మొదలు భక్తజన సులభమై నిత్య సేవ్యమయినది.

## పురాణ నిర్ణయము

శిలాదుడు, రససిద్ధుడు ఎప్పటివారు? కృతయుగము వారని పురాణ నిర్ణయము, రససిద్ధుడు నిర్మించినఆలయాదులే కాలక్రమమున జీర్ణోద్ధారములు కావచ్చును.

*****

## నందరాజులు

నంద్యాలను నందరాజులను రాజధానిగ ఏలినట్లు చరిత్ర గ్రంథములు తెల్పుచున్నవి. వారికాలములో నందిమండలములోని దివ్య క్షేత్రములన్నియు మహోన్నతస్థితిలో నున్నవి. వారు జీర్ణోద్ధరణములను చేసిరి.

ఒకరాజు మహానందీశ్వరునికి లక్షఘటముల గోక్షీరాభిషేకము చేయించెను.

*****

## బోయదొరలు

మహానంది అరణ్య ప్రాంతమగుటచే ఇది కొంతకాలము బోయదొరల పాలనమున కలదు. స్వామి కైంకర్యాదులు వారి వలననే జరుపబడి యుండవచ్చును.

ఇది చరిత్ర విషయము

*****

## నవ నందీశ్వరుల ప్రదక్షిణ క్రమము
## శ్రీశైల ఖండము – మహానంది మహాత్మ్యము

శ్లో॥ నంద్యాది మండలం యస్తు ప్రవిశేన్నియమ వ్రతః
సద్యస్సిద్ధి మవాప్నోతి సర్వపాపైః ప్రముచ్యతే
(అధ్యాయము 46)

తా : నందిమండలము నియమవ్రతుడై ఎవరు ప్రవేశింతురో వారు సర్వ పాపములనుండి ముక్తుడై సర్వసిద్ధులను పొందును. దాని క్రమమే నియమవ్రతము. ప్రథమమున నవనందీశ్వర పాలకుడైన బ్రహ్మనంది సన్నిధానవములో నవనందీశ్వర ప్రదక్షిణమునకు ఉపక్రమించుచున్నట్లు సంకల్పించి (నివేదించుకొని) అక్కడ నుండి ప్రాఙ్ముఖముగ బయలుదేరి ప్రదక్షిణముగ తిరుగుచో మొదట ప్రథమమున (1) శివనంది (2) విష్ణునంది (కృష్ణనంది)

(3) మహానంది (4) వినాయకనంది (ఇది మహానంది లోనే యున్నది) (5) గరుడనంది (6) సూర్యనంది (7) నంద్యాల లోని సోమనంది (8) ప్రమథ (ప్రథమ) నంది (9) నాగనంది దర్శించి చివరకు బ్రహ్మనందీశ్వరుని సన్నిధికిచేరి "నవనందీశ్వర ప్రదక్షిణము పూర్తిచేసితిని" అని నివేదించుకొన వలెను.

"యాని కానిచ పాపాని జన్మాంతర కృతానిచ
......ప్రదక్షిణ పదేపదే"

అను మంత్రముతో ప్రదక్షిణము చేయుట ముఖ్యము.

# నంది క్షేత్ర విశేషములు

మహానంది స్వయం భూలింగము. పుట్ట ఆకారము గా నుండును. లింగముచుట్టు దరిమిలా అమర్చిన పానవట్టముగలదు లోపలకు పొనుపొను చుట్టుకొలత విస్తరించి గొఱ్ఱెపిల్లల గూడు వలె నుండును. అని 1936 సం॥ ప్రాంతములో పరిశీలకులు తెల్పిరి

1936 సం॥లో ధర్మకర్త భైరవజ్యోస్యుల మహానందయ్య గారు (నంద్యాల) గర్భాలయములోని చట్టమును. పానవట్టమును బాగుచేయించిరి. ఈ లింగము క్రిందినుండియే నీటిబుగ్గలుబయలు దేరినవి. అవి పుష్కరిణి లోనికి ప్రవహించు చున్నవి. ఇది రుద్రతీర్థము.

# కోనేరు

కోనేరంతయు ఒకేలోతు గలిగి యున్నది. పడమర ప్రక్కన రెండు తూములు వాటిద్వారా ప్రాకారము వెలుపల గల రెండుకోనేరులకు అక్కడ నుండి పంటభూములకు ప్రవహించును. దాని క్రింద అరటి, నిమ్మ వరి తోటలు, పొలములు గలవు.

నీరు అతి స్వచ్ఛముగా నుండును. సమవెచ్చగా నుండును. అతి తేలికగా నుండును.

కోనేటిచుట్టు మంటపము గలదు. మధ్యమంటపములో పంచ లింగములున్నవి. నాలుగుప్రక్కల మెట్లు గలవు. తూర్పుదిశకి పక్షిణభాగమున నందిముఖము గలదు. దానినుండి కోనేరులోనికి నీరు వచ్చుచుండును.

# ఇతర ఆలయములు

విశాల ప్రాకారము మధ్య 'మహానందీశ్వరాలయము' పార్వతీదేవి ఆలయము, వీరభద్రాలయము, కోదండరామాలయము ఇతర శివాలయములు గలవు. ప్రాకారమునకు దక్షిణ, ఉత్తర, పశ్చిమ దిశలలో గోపుర ద్వారములు గలవు.

# అన్న సత్రములు

భైరవజోస్యుల రామయ్యగారి సత్రం, బెజవాడ వారి అన్నసత్రం (నిలిచిపోయినది.) బ్రాహ్మణసత్రం ఆర్యవైశ్య సత్రం, గుండు గోపాలరెడ్డిగారి సత్రం కలవు.

# సూర్యనంది

శివాలయము, దేవలయము, దేవాతామూర్తులు సూర్యనంది, పార్వతి నవగ్రహ మంటపము కలవు.

## సోమనంది

శివలింగమొక్కటియే కలదు.

## శివనంది

శివలింగము, పార్వతి, నరసింహస్వామి, గణపతి గలరు.

## బ్రహ్మనంది

గోశాల గలవు.

అవధూతస్వామి - క్రీ॥ శ॥ 1800 ప్రాంతములో శ్రీ అవధూత స్వాములవారు మహానందిలో పుష్కరిణిని బాగుచేయించిరి.

1902 / 1947 సం॥లో భైరవజోస్యుల మహానందయ్యగారు జీర్ణోద్ధారములు చేయించిరి.

## కళ్యాణము

శివరాత్రికి కళ్యాణమంటపములో స్వామివారి కళ్యాణము జరుగును. దీనికి ముందు మహానందీశ్వరస్వామి వారి ఉత్సవ విగ్రహములు నంద్యాలలోని బ్రహ్మనందీశ్వరస్వామి వారి విగ్రహములకు ఉదయము గ్రామోత్సవము జరిపి సాయంత్రము వకు రెండు పీఠములును మహానందికి చేర్తురు.

శివరాత్రి నాటిరాత్రి కళ్యాణము జరుగును. మూడవ దినమున రథోత్సవము జరుగును. నాల్గవదినము రాత్రికి మరల నంద్యాల బ్రహ్మనందీశ్వరాలయమునకు చేరును.

కామేశ్వరిదేవి - 1935 పునఃప్రతిష్ఠ జరిగినది.

రామాలయము - 1948 మహానందయ్యగారి భార్య శేషమ్మగారు ప్రతిష్ఠ చేసిరి.

# Topographical List of the Inscriptions of the Madras Presidency Collected Till 1915

(V. Rangachary, M.A. L. T.,)

Vol. II

## MAHANANDI

SRI ANTIQUITIES 1-95, MADRAS JOURNAL VOL. XXIII (ii)74.

541 : 172 of 1913 - (Telugu) on the Dhwaja stambha in the Mahanandeswaraswami Temple Records in S. 1446 Tarana Magha ba-di 14 Monday, Sivarathri, corresponding to February 20, AD 1525 that a merchant built the mantapa called MUKHABHADRAM at the southern entrance into the tank (gundam) and the pillar surmounted by a bull in the temple of Mahanandeswara.

54-A : 173 of 1913 (Telugu on an iron pillar near the water-gate of the same temple. Records in S-1332, Vikriti Magha ba-di 13 Friday corresponding to February 20. AD 1410' that the great grand mother (2) of Tipparaju son of Pina-Tipparaju, son of Velugoti Gangalraju-Chendrajum garu, the hero of krottacherla kota set up this lamp pillar before the shrine of Mahanandeswra.

See Antiquities 1-95. (The record is important for the inforamtion it gives of three generations of Veligoti rulers, not found elsewhere. They had the titles of "Born of the matchless Choola race' Lords of the city of Nandyala, worshippers of Mahanandeswaran and the hero on the battle field of Krothacherl a Kota (i. e Kocherla Kata in Palned).

542 : 174 of 1913-Kanares, (Telugu and Nagar on seven detached stones in the same temple. Records in ancient characters o- the eigth and ninth centuries of the Chrisf tian era. Four in Telugu - Kaneres record the names Sarigesampunna Mahamuni, Ayogava (rjitam) utpatipidugi katamu-ı kkan Merupritivi. Sri Vyalasimhagurava and Tellapundi Apparaju. One in ,Nagari reads Sri Lallankagova (1) haraja.

543 : 175 of 1913 (Telugu) on six other detached stones. Contains the signatures of devotees, three of which seem to be rather old Among these are Jayaravi and Doracharya, a mine of architect intelligence (Chitratejonidhi).

## ANDHRA PRADESH Dt. GAZETTEERS :

Kurnool (Revised Addition) Ancient Period (P. 31

1. NANDAS : The history of the district can be traced from the Nandas. Though the southern boundary of the Nanda empire cannot be defintely fixed, the existence of punch marked coins all over India, the reference to the rule of Nandana Chakravarthi. Over this district in the "Sn-Chowdeswari Puranam" and the places and names like Nandavaram, Nandyala, Mahanandi and Nandikotkuru Suggest the sway of the Nanda rulers over this part of the country also. The Nanda dynasty was over thrown by Chandragupta Mourya about 323 B. C.

P. 35 : Saivism was the religion parexcellance of the age though the other religious faiths Vaishanavism, and Jainism also existed. Siva was worshipped by the Chalukya Monarchs and Srisailam was a favourite shrine often visited by the members of the royal family. The fendatories and the officials followed the example of their sovereigns and not only built shrines of Siva but also renovated the old temples.

MAHANANDI :

Rameswara Tirtham with the Panchalingeswara Temple. Madagiri Tirtham, Tripurantakam and Sangameswaram, known as the Nivritti-Sangam in Nandi Kotkur Tq. were some of the important pilgirm centres of the period of the district.

The temple had a supreme place in the Socio-religious life of the period. The organisation of the temple included the "Pujaries" or priests and a large number of servants. In a big temple like Tripurantakeswara at Tripurantakam (Markapur), the temple servants were divided into as many as seventy two (72) categories (Bahattaraniyogas బహ్బత్తరనియోగాలు) Gifts recorded in favour of the temples were made to the Saiva Monk, who belonged to Kalamukha persuation, following Lakula Sidhanta or the doctrine profounded by Lakula. There monks ware genera ly the acharyas of the temp.es and chose the 'Stanadhipati' or Stai acharya trom among themselves and administered the tempie properties.

Besides Kalamukha Saivism, Vira Saivism propounded by Basaveswara towards the

end of Chalukya rule was also prevalent. Virasaivism laid emphasis on "Bhakit or devotion as the means of salvation. The attempt to establish a casteless society by Basaveswara did not succeed as his followers, the Lingayats themselves succumbed to the influence of caste in course of time. Basaveswara came in conflict with the Kalachurya King Bijjala whom he caused to be assassinated. He was hotly pursumed by the sons of Bijjala and on reaching Sangameswaram, Basaveswra is said to have jumped into a will in the temple of Sangameswra and attained salvation Besides thece the Vedic faith flourished

P. 36 : in the Brahmin agraharas scattered all over the empire and it was ardently believed that the prosperity of the Countly and the happiness of the people depended on the adherence to well-established Vedic practices. The Kings and their feudatorries and officials extended their patronage to the Brahmins the exponents of the Vedic faith, who enjoyed unquestioned social

esteem and engaged themselves in the study and teaching of the Vedas. Their agraharams became the centres of Vedic learning where young men acquired knowledge of the scriptures.

*****

## GENERAL CONDITIONS

P. 45 : On the religious plane, Saivism Vaishanavisam and Jainism were important during this period (Medival period) The early rulers of Vijayanagar empire were devotees of Lord Siva and believed in the proprietory relationship of the empire to Lord Virupaksha. The salvaint shrines in Srisailam, Mahanandi, Sangameswaram and Tripuranthakam received royal patronage.

## ANIMAL HUSBANDRY AND FISHERIES

P. 88 : A fodder bank was , however established during 1965-66 at Mahanandi for supplying fodder to the arears of scarcity in the district. The most important varieties of fodder stocked by the ryots are paddy straw, Jowar and maize stock.

MAHANANDI : TIMMAPUBAM

op : 2282, Lat 15o-30' N. Long 78o-35, E Thimmapuram village is situated nine Kilometers East of Nandyal and derives its importance from Mahanandi whicn is aboue sixteen Kms. from Nandyal. Gajulapalli railway station' which is eight Kms. from the place is the nearest railhed. There are communication faciliities by bus tothis place from Nandyal. and Srisailam. This place is a reputed Pilgrim centre in the state and a scenic spot owing to its location to the east of the Nallamala hill ranges in natural gorge of ravishing beauty surrounded on all sides by thick forests The shrine of Mahanandeswara is Plece noted for its sevenity. Mahanandi has very interesting historical and legendary associations. With in a redious of about sixteen Kms from Mahanandi. Lie nine nandis known as the NAVANANDIS. This main shrine of Mahanandeswara is unipue in many respects. This shrine as well as the other temples exhibit architectual splendour. The festival of MAHANANDISWARA is celebrated for over seven days commencing from Magha Bahula

Chaturdasi (February - March) and the Hindus from different parts of the country, particularly from Andhra Pradesh, Mysore and Maharastra States visit this place, the daily congregation being about 20,000.

## NANDYAL

P. 250 : Nandyal was originally known as Nandi Alayamu

There are some ancient temples at thc place like Prathema Nandi and Krishna-nandi. The most important festival here is that of Krishna Nandi' celebrated during January - February. The shrine is one of the Navanandi s in the neighbourhood of Mahanandi and Nandyal.

The piligrims numbring about 50,000 pro ceeding to Mahanandi from this state as well as Mysore and Maharastra srates visit this forest shrine during Mahasivarathri

MANUAL OF THE KURNOOL DISTRICT (1886) :

P. 11 : SPRINGS : Several springs issue from the hills described above (erramalas), but owing to the peculiar structure of the rocks

that compose the hills, the supply of water is not copious of the Nallamala springs the principal one is that of Mahanandi, about ten miles to the South east of Nandyal It is a perennial spring of lightly tepid water. A Pagoda has been built over and around it. A small tank in front of the temple, about thirty feet square and five feet deep, receives the water. The water in the tank is beautifully clear and limpid, quietly wells up in one of tts corners and passes out through a hole in another corner. From the tank the water flows in a fine stream to the Nandyal tank. The temperature is about 89° The tank may be said to be most delicious bathing place in the district.

According to Capton Newbold the water of this spring is perfectly tastless, contains a few bubbles of fixed air and reddnes litmus paper, oralate of ammonia renders it slightly milky.

The formation of the country is altered sandstone and limestone. The once famous diamond and load mines of Basavapur lie in the neighbourhood.

There are similar springs at Omkara Chagalamary. Sirivel and several ot places at the base of the Nallamals, but they are not so copious. Cultivation is Carried on under all of them as well as under the Mahanadi stream.

## OBJECTS OF WORSHIP

146 : Mahanandi, a Siva Temple, near Nandikanama, and Gorantla, a Vaishr temple in Rallakota, are also impor places at which large numbers assem on occasions of festivals. The remain institutions are only of local importan

*****

**V. S. SASTRY**

21--5--1985

*Oriental Research Centre.*

Seethampet, RAJAHMUNDRY-4

శ్రీ శివసాయి ప్రింటర్స్, నంద్యాల